

# విభీషణపట్టాభిషేకనాటకము

ఇది

శ్రీకృష్ణలీల లవకుశాద్యనేక నాటకగ్రంథకర్తలగు

వైయ్యాకరణి. పండిత కే. సుబ్రహ్మణ్యశాస్త్రివార్యులచే

రచియింపబడి



బళ్లారి

## కె. యస్. శాస్త్రులు అండు సన్సుగారిచే

ప్రకటింపబడినది



మొదటికూర్పు

చెన్నపురి కనరా ముద్రాక్షరశాలయందు

ముద్రితము.



1918.

వెల రూ. 1] [పోస్టేజి ప్రత్యేకము.

మంగళాంతముగ ముగింపఁదలంచుటను, రామాయణకథను పంచ
పట్టాభిషేక యుతముగ రచించు కుతూహలమునను సుందరకాండాంత్య
మునసే బొందుపరుపవలసివచ్చినందుకు క్షమింతురని వేడువాఁడను.

ఆంధ్రలోకోన్నత [illegible]సంపన్నమై నానాటవెలరాదుచున్న బళ్లారి సరసవినోదిని సభకాధ్యక్షులై యనేకాంధ్ర కర్నాటకనాటకవృత్తైన రావుబహదూర్ హనుమంతగౌడుగారును, తత్సభ జనరల్ మేనేజరు పదనధివహించి, సవనాగిరీక యువతీప్రహసన, సుందరీవిజయాది గ్రంథ రచనచే వాశిగని యనేకహాస్యరసప్రధాన పాత్రల నభినయ సంపాదిత జగన్నుత [illegible]సంపన్నులైన మ-రా-శ్రీ బి. మాధవరావుగారును మాకు సహాయ్య ప్రోత్సాహముల నొసంగినందుకు మా కెంతయు శ్లాఘనీయులు.

ఈ నాటకకథానాయకుఁడు శ్రీమదాంజనేయుఁడగుటచే తత్పాత్రనాటకారంభమునుండి నాటకాంతమువరకు నభినయించు కష్టము మొట్ట మొదట నాటకప్రదర్శనమునకత్యంత కష్టంబై చూపట్టె. అట్టి మహాకష్ట మును తొలగించి తత్పాత్రను గైకొని స్వకీయ్యానుపమాన మృదు మధురకంఠనాద సంగీతామృతపానముచే సభ్యులనెల్లను నానందాబ్ధి యందు ముంచి యుక్తవరకే మా సరసవినోదిని సభకు పెట్టని యలంకా రమగుచు నానాప్రముఖపాత్రల గ్రహించుచు చెన్నపురి మొదలగు రాజధానియందు నిరుపమాన సత్కీర్తి గౌరవపదకములనందుచువచ్చిన బ్రహ్మశ్రీ జె. గిరియాచార్యులవారు మా కెంతయు ప్రశంసనీయ్యులు.

నేను దాదాపున రెండు సంవత్సరములనుండి యనివార్యగదా విష్టుఁడనై మంచముపట్టియుండుటచే ముద్రణాసంస్కారమును సంపూర్ణ ముగ నొనరించి నాకు సహాయ మొనరించిన బ్రహ్మశ్రీ శ్రీపర్ణశాల నరసింహా చార్యులవారు మా కెంతయు వందనీయ్యులు. నేను ముద్రణదోషాత్త దోష ఛందోదోషాదుల సవరించుటకు వీలులేని కతమున గ్రంథమున ననేక దోషములుండవచ్చును, వాటినన్నిటిని రెండవకూర్పున సవరించు కొనియెదను, తద్దోషముల క్షమింతురని విన్నవించు

బళ్లారి,
4—2—1918.

తమవిధేయుఁడు,
వైయ్యాకరణి. పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రి.

# ప్రకటన.

ఇందువలన సూచించుట యేమనగా నాచేవిరచింపఁబడి ప్రకటింఁబడిన కృష్ణలీల లవకుశనాటకములకు బోలె ఈ విభీషణపట్టాభిషేక నాటకమునకుగల సర్వస్వాతంత్ర్యములు క్రొత్తకాపిరైటు ఆక్టుప్రకారము నాకుఁజెందియున్నవి. అయిన వీట్లను భాషాంతరీకరణ మొనర్పవలయు నన్నను లేక ఖేలన మొనర్పవలయు నన్నను నాయనుమతిని వ్రాతమూలమున పొందుటయేగాక రావుబహదూర్ బ్రహ్మశ్రీ కె. హనుమంత రావుగారియొక్కయు బ్రహ్మశ్రీ బి. మాధవరావుగారియొక్కయు అనుమతిని పొందవలయును. అటుగాక స్వతంత్రించిన వారలు మానష్టములకు పాత్రులగుదురు.

బళ్లారి,
4—2—18.

పండిత కే. సుబ్రహ్మణ్యశాస్త్రిలు.

# శుద్ధాశుద్ధపత్రిక.

| పుట. | పఙ్క్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 1 | 7 | 1—2 | (1) |
| 4 | 6 | 3 | (2) |
| 5 | 7 | ప్రధ్వంసము | ప్రధ్వంసము |
| .. | 11 | 4 | (3) |
| .. | 20 | దేవి | దేవి |
| .. | ... | షనా | షణా |
| 8 | 4 | 5 | 4 |
| .. | 5 | రామా | రామ |
| .. | 15 | నిలుచుండును | లేచును |
| 9 | 25 | నిలుచుండును | లేచును |
| 10 | 12 | చక్ర_గ | చక్ర_గ |
| 11 | 5 | యాధీ | యధీ |
| .. | 6 | (అనుబంధము 5) | |
| 13 | 14 | లీల | లీలన్జేయు |
| .. | 15 | భేదించి | భేదించి |
| 16 | 3 | మనోహరిన్ | మనోంచితన్ |
| .. | 6 | చోట్లనో | చోట్లకో |
| .. | 9 | ఉ॥ రాజసుతుండ, 17-వ పుట 5-వ పఙ్క్తియందలి ॥చ॥ ఘనతర అనుపద్యములు ఒండొంటిస్థానములం జేర్పవలయు. చ॥ తలపరు అనుపద్యమును 17 పుట 24 పఙ్క్తియందలి ॥మ॥ ధరణీనందన అనుపద్యమును ఒండొంటిస్థానముల మార్పవలయు. | |
| 16 | 24 | కాంక్షింత | కాంక్షిత |
| 17 | 5 | (పంచయనిచేర్పవలయు) | |
| 17 | 25 | రఘు | రఘు |
| 22 | 23 | సంక్రమణ | చంక్రమణ |

| పుట. | పఙ్క్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 22 | 24 | మోాబ | మోాజ |
| 23 | 22 | దుగ్గు | దూరు |
| 28 | 14 | సట | ననుట |
| 28 | 15 | గనగానా | గనగానానో |
| 30 | 7 | దరు | దరి |
| 39 | 2 | గాంచు | పెంచు |
| ... | 24 | మునకు | ముకు |
| ... | 26 | మునకు | ముకు |
| 40 | 1 | ము అకన | మావిదిత |
| ... | 3 | నసురో | శాసురో |
| ... | 4 | మునకు | ముకు |
| ... | 8 | ధ్రాము | ద్రాము |
| ... | ... | మఖిల | రవి |
| ... | 28 | ధాఉనో | ధ్రోర్లో |
| 43 | 21 | దహించి | దహాయించి |
| 58 | 7 | రాము | రాము |
| ... | 22 | దివ్య | సింధు |
| 51 | 24 | వెత | ననువేదన |
| ... | 27 | మన్న రావణా | మన్న దలంపు రావణ |
| 52 | 22 | షము | షణము |
| 53 | 10 | "ఉ" | "ఉ" పంచ |
| ... | 11 | న్నల్ల నదు | న్నల్ల సమాదు |
| ... | 10 | పిల్లెదు | పిల్ల గు |
| ... | 14 | నోల్లని | ఒల్లని |
| ... | 17 | భేధ | భేద |
| 55 | 26 | బునభ | బునస్భ |
| 60 | 19 | అప్పుడో | యప్పుడో |

| పుట. | పం. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 60 | 23 | అప్పుడో | యప్పుడో |
| 61 | 3 | నాశి | నాది |
| ... | 4 | ॥ చ ॥ | చ ॥ పంచ ॥ |
| ... | 7 | కార్య | కార |
| 64 | 16 | నుక | [illegible] |
| 67 | 14 | గోందును నో | గోందునునో |
| ... | 15 | భీర | భీరు |
| 69 | 18 | కిణి | కిణిని |
| 70 | 18 | కాంద్రమమూటాడ | కాంద్రుం బల్కు |
| 74 | 2 | రది | రివది |
| 76 | 11 | గందు | గంద |
| 80 | 18 | కుని | కుని గెల్చి |
| 81 | 17 | ధముల | ధనముల |
| 83 | 13 | ప్రభుం సితండే | స్వామియితడే |
| 88 | 24 | కోల | కూల |
| 99 | 14 | స్రుక్కురో | స్రుక్కురో |
| 101 | 18 | దాసమునిశంమంత్రం | దాసమంత్రమునిశం |
| ... | 23 | భువినిన్ | భువిన్ |
| 104 | 13 | ముదుగుముకొని | ముదుగు |
| 114 | 15 | 2 | 1 |

124 21-25 ఈపాట 5 యనుబంధమందలి 8 పజ్త్కి పిదప యుండవలెను.

125 7-11 నినుమదమణచెద యనుపాట 2-వ యనుబంధము

అనుబంధము 10)

శ్రీ రఘుకుల క్షీరాబ్ధిమణి ॥ రామణీ ॥ నళిననేత్ర నారదాదివం దిత కలితభావనామునితవందిత ॥ శ్రీ ॥ సాధుపోషణా - సరసిజచరణా- రాఘువరామాకావగదె జానకీవరాదాసవహరణా శ్రీకరాశ్రుతివార సన్నుతా ॥ శ్రీ ॥

(అనుబంధము 11)

పై పాటయే

విన్నపము :—శకటరేఫార్ధానుస్వారాదు లిందంతగ పాటింపబడలేదని విన్నవించుచున్నాను.



నాంది :

శా। పంచ॥ శ్రీసీతాసతివామభాగమున తాఁజెల్వొందవాతా
త్మజుఁ। డాసన్నుఁడయిపాదపద్మముల తాహస్తంబుననందాల్పగా। శ్రీ
సౌమిత్రిసితాతపత్రముతగన్ చేదోయిసందింపగా। వాసిన్ సోదరయు
క్తుఁడై జగములన్ పాలించు సుగ్రీవల। క్ష్మీసంధానుఁడు రామచంద్రుఁ
డొసగున్ శ్రీరాయురైశ్వర్యముల్॥



శ్రీ

# విభీషణ పట్టాభిషేక నాటకము.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము—కిష్కింధానగరము.

[ఉద్యానవనమున సుగ్రీవుఁడు, రుమ, తార, వానరులు మధుపానము చేయుచు నృత్యము మొదలగు వినోదముల సలుపుచుందురు.)

(అనుబంధము 1 & 2.)

సుగ్రీవ॥ తారా! చూచితివా! ఈమయూరము లెట్లు కేకారవములు చేయుచున్నవి?

తార॥ కాలము వచ్చినపుడందఱును నిట్లు విజృంభించుట సహజమే కదా? నీవుమాత్రమిప్పు డెట్లున్నాడవు చూడుము. వాలి యున్నప్పుడూపిరియైనను గట్టిగ విడుచుచుంటివా? ఇప్పుడు రాముని యనుగ్రహమునఁ గొంచెము ధీరతనము రాఁగానే నాసమానుఁ డెవ్వరని యందఱిని నాక్ష చేయుచున్నావు. సుగ్రీవాజ్ఞయన్న నందఱిని దల్లడిల్లునట్లు చేయుచున్నావు.

సుగ్రీవ॥ ప్రేయసీ! పూర్వము మాత్రము నేను తగ్గియుంటినని తలంచెదవా? సరిసరి. నాప్రతాపము వాలికిమాత్రము తెలియదా? ఏమో "అన్న తండ్రితో సమానుఁడ"ని, యూరకుంటినిగాని నేను నిజముగాఁ గోపగించియుండిన నీవాలి గీలి నాకొకలెక్కయా? అంతేల? రాముఁడు నాతో విరోధముకట్టుకొననీ; తనయయోధ్యాపురమును

మఱచిపోవునట్లు చేసెద. నీ కేమి తెలియును ఆడుదానికి ? ఈ సుగ్రీవుడు వైరిజన కేసరి యనుకొమ్ము.

తార ॥ ఐన వాలిని రామునిచే నేల చంపించితివి ?

సుగ్రీవ ॥ (నవ్వి) ఇంత తెలిసికొనజాలవా ? నేనే వాలిని జంపియు౯డిన లోకులందఱు "వీడు భ్రాతృద్రోహి ; అన్నను చంపినవాడ"ని నన్ను దూషింతురని రాముడని యొకనినడ్డముపెట్టి నేనే లోలోపల నాముష్టియుద్ధమున వాలిని కొనప్రాణముకు దెచ్చి యూఱక రామునితో బాణము వేయించి "రాముడు చంపినాడ"ని రామునిపై నపకీర్తి వేసితిని.

తార ॥ నాథా ! ఐన రాముడు చంపెననుట కల్లయేనా ?

సుగ్రీవ ॥ కల్లయా ! రుమా ! నీవు నాడు యుద్ధమునకు రావలసి యుండెను. తెలియుచుంటివి. రాముడే వాలినిజంప బలశాలియైన చెట్టుచాటుననుండి దొంగవలె యేదో యొక పనికిమాలిన చిన్నబాణముచే దునుకను నైచునా ? నాడే రాముడు "నీయెదుటనా నాపరాక్రమము ? నేను వాలిని జంపగలుగుదునా" యని నాతో మొఱపెట్టుకొనెను. "నీవూరక చేరునకు మాత్రముండుము. అంతయు నేనేచేసెదను" అనియే యొప్పించితిని. లోగుట్టు పెరుమాళ్ళకెఱుక.

తార ॥ నాథా ! ఇప్పుడుకదా నీ పరాక్రమముదెలిసితి. నేనేమో యిదివఱకు సామాన్యుడని యెంచియుంటిని.

సుగ్రీవ ॥ ఇప్పుడు ?

తార ॥ లోకైకవీరుడని యెఱిగితి.

సుగ్రీవ ॥ అందుకే తారాసతియన్న లోకులందఱు మిక్కిలి బుద్ధిశాలిని యందురు.

మ ॥ నాథా! నీవు ఋష్యమూకపర్వతమున దాగికొని యున్నంత కాలము——

సుగ్రీవ ॥ ఆమాటనకుము. ఈ సుగ్రీవుఁడా యొకనికి భయపడి దాచుకొనియుండువాఁడు?

(లోపలధ్వని. అందఱు భయపడెదరు)

సుగ్రీవ ॥ (భయముచే వణఁకుచు) వా-న-రు-లా-రా! అ-ది-యే-మి చూ-చి-రం-డు.

తార ॥ నాథా! మీరేమియు భయపడవలదు.

సుగ్రీవ ॥ నీకు బుద్ధిచాలదు. భయమా? భయమనఁగ నెట్టిది?

రుమ ॥ ఐన మీ దేహమేల వణఁకుచున్నది?

సుగ్రీవ ॥ ఏలనీకీ యధికప్రసంగము. (కొంచెము ఒడలు చక్కపెఱచుకొని) వణఁకుటయఁట! శత్రువునచ్చి వినరానిమాటలఁ బలికిన నావంటి ధీరాగ్రణికిఁ గోపముకలుఁగదా? ఆకోపముచేత దేహము వణఁకదా?

(ప్రవేశము; అంగదుఁడు)

అంగద ॥ దేవా! ద్వారమున నెవరో లక్ష్మణుఁడఁట! రౌద్రాకారుఁడై కడువచ్చి భయంకర హుంకారము చేయుచు కాల రుద్రునివలె మండిపడుచున్నాఁడు. ధనునెక్కిడియుండుటను జూడ మనకిష్కింధ నొకక్షణ్గ నాపోశనము తీసికొనునని తోఁచుచున్నది.

సుగ్రీవ ॥ (అదరిపడి నోటిమాటలురాక తొట్రుపడి వణఁకుచు) ఏమి యేమి? లక్ష్మణుఁడా! తారా! ఇఁక నేఁ జచ్చితి. పిడుగులకైన నోర్వవచ్చుఁగాక ఆ రామలక్ష్మణుల బాణముల కోర్చుట దుర్లభము. మనము సుఖములచే వారికార్యమును మఱచితిమి. అందుకై కోపమున నిందు వచ్చియున్నాఁడుకాఁబోలు.

తార॥ అంగదా! ఆ మహాత్ముని వినయముతోఁ దోడితెమ్ము.

అంగద॥ (నిష్క్ర-)

సుగ్రీవ॥ రుమా! నీవు పీఠమును బూజాద్రవ్యములనుందీసికొనిరమ్ము.

రుమ॥ (లోపలికిఁబోయి వానిని దీసికొనివచ్చును.)

(ప్రవేశము లక్ష్మణుఁడు రౌద్రాకారమునఁ బాడుచు)

(అనుబంధము 3.)

శా॥ ఓరీ పాపమతీ! కృతఘ్న! ఘనగర్వోన్మత్త! లోకాధమా
ఆరామాంగిని, జానకీసతిని నేనర్పింతునంచీవు నా।
రూరన్ బల్కఁగలేదె? చేసితివె? క్రూరోద్యోగనిక్షిప్తునే
ఘోరాకారత నిన్ను నీపురిని నాక్రోధాగ్నిచేఁ గాల్చెదన్

లక్ష్మణ॥ ఓరీ! సుగ్రీవా! మిత్రద్రోహీ! నిన్నేమనవలయు? వర్షా కాలము వెళ్లినవెంటనే సీతాదేవిని వెదకించెదనని చెప్పి రాజ్యమదాంధుఁడవై కన్నుఁగానక యిప్పుడా ప్రతిజ్ఞను మఱచితివా? లేక శ్రీరాముని నొక లెక్కకుఁగొనక విడిచితివా? దుర్మతీ! నీవొక మిత్రుఁడవే? ఛీ! నిన్నుఁగనిన పాతకము. నీకార్యానంతరమున నెట్లుచేసిన నట్లు చెల్లునను కొంటివా? వాలిని సంహరించిన ఘోరతర శ్రీరామబాణమునకును నీకును జుట్టరికముకలదని యెంచితివా? సశించి తివింకెక్కడకుఁ బోవువాఁడవు? ఫాలాక్షుని మరుఁగుఁజొచ్చినను, ఆ దేవేంద్రుని వెనుజొచ్చినను, పాతాళంబుఁ జొచ్చినను, నిన్ను విడువను. మఱోకఁ-దండకాండములనీయొడలు చీల్చి నీరక్తమాంస ఖండంబుల నా క్రోధాగ్నికి బలియిచ్చువఱకు వెనుకకు మరలుదునే? నిక్కంపు మిత్రుఁడవన్న నీవు కదా! వాలి భయమునఁ గొండగుట్టలఁజేరి మొందో చావనున్న నిన్నొక రాజుగాఁజేసినందునకా నీకిట్టి యహంకృతి

కన్నులం గప్పెను? వాలి ముష్టిఘాతమునం జచ్చు పుణ్యము నీకు లేదు. మిత్రద్రోహమొనర్చిన నినుంబోలు కృతఘ్న జనులుండుట భూమికెంతయు భారము. దురాత్మా! తెలంచుకొమ్ము మిత్రద్రోహమునకుం దగుఫలమిదియేయని. ఇదే నీ కష్టేంధనోత్కర నిశిత శరాగ్ని వహ్ని జ్వాల దహించి బూడిదచేసి సముద్రమునం గలిపెద. నీయట్టి దుష్టాంగ విధ్వంసమునం గాని నాకోపాగ్ని చల్లారదు. ఇదే చచ్చితివి. (అని కోదండమెక్కుం బెట్టును.)

(సుగ్రీవుడు తార వెనుకకుం బోయి డాగికొనును. తారారుమలు లక్ష్మణుని పాదములంబడి వేడికొందురు)

(అనుబంధము 4.)

మహాత్మా! లక్ష్మణదేవా! నీవు కోపింప మేమెంతటివారము? మాపతియగు సుగ్రీవుడు యెఱుకలేనితనమునం జెప్పరాని యపరాధ మొనర్చెను. దానికై మేమందరము త్రాహియని నిన్ను శరణొందియున్నవారము. నీవు మా యపరాధముల మన్నించి కావకున్న వేఱు దిక్కు లేదనువారము. దీన దయాళో! ఈ సుగ్రీవుడు మొదటనే వానరుడు. అందును రాజ్యమదాంధుడై యున్నవాడు. అట్టిచో వివేకము కలుగనేర్చునే. ఇప్పుడుమాత్రము క్షమింపుము. ముందట్టి కార్యము చేయడు. ఇక జానకీదేవి యన్వేషణార్థమై వానరబలమునుంబంపునటుల మేముత్తరవాదులము కాంగల వారము. శరణుజొచ్చిన వారిని గాపాడుటయేకదా మీ బోంటివారల క్షత్త్రధర్మము? దీనజనులను గాపాడుటకిది గదా వేళ? దేవా! ఈ సుగ్రీవునియందుం గరుణలేకున్నను మానె; ఆర్తులమై "పతిభిక్షాం దేహి" యని పలుమారు వేడుచున్న యబలలమగు మాయిరువురికొఱకైనను గరుణ గలిగి మాపతిని బ్రోవుమా. (అని కాళ్ళంబడుదురు.)

లక్ష్మణ॥ తరుణులారా! లెండు. మీకొఱకై సుగ్రీవుని నిప్పుడు నే క్షమించి యున్నాను. మఱియు శ్రీరామచంద్రునకు మీ భక్తిని విన్నవించి క్షమించునట్లు చేసెద. సుగ్రీవా! నీకాంతామణుల మొఱనాలించి నీకుఁ బ్రాణదానమొసంగితిని. లెమ్ము శ్రీరామచంద్రుచెంతకు వెళ్లుదము.

సుగ్రీవ॥ (నమస్కరించి వణఁకుచు) దేవా! నీ దయాగుణమునకు గృతజ్ఞుఁడనై యుండెద. ఐనను నేనెటుల శ్రీరామసన్నిధానమునకు రాఁగలను. అతనితో నేమని విన్నవించువాఁడ; నేఁజేసిన మహాపరాధమునకై యతనినెట్లు క్షమింపవేఁడువాఁడను?

లక్ష్మణ॥ రమ్ము పోవుదము. నేనంతయు సరిచేసెదను.

(నిష్క్రమము.)



శ్రీ

# విభీషణ పట్టాభిషేక నాటకము.

## ప్రథమాంకము—ద్వితీయరంగము.

### మాల్యవంత గిరిప్రదేశము.

(శ్రీరాముఁడు కూర్చొనియుండును. ప్రవేశము. లక్ష్మణుఁడు సుగ్రీవుఁడు మొదలగువారు కపిసైన్యముతో)

లక్ష్మణ॥ దేవా! ఇదే సుగ్రీవునిఁ గొనితెచ్చియున్నాను. అల్లదే! కపిసైన్యమంతయును వచ్చియున్నది. ఈ సుగ్రీవుఁడు మిక్కిలి కామాంధుఁడై తనపత్నియగు తారతోఁగూడి విహరించుచు నీప్రపంచమునే మఱచియున్నవాఁడు. మున్ను తమయెదుటఁ జేసినప్రతిజ్ఞను సహితము స్మరింపకయే యున్నవాఁడు. లోకమునఁ గామమదాంధులైనవారికి యుక్తాయుక్తములు తెలియఁజాలునే. అందును రాకరాకసిరివచ్చిన నట్టివారు దేహమునే మఱతురఁట; ఇఁక నిచ్చినమాట మఱచుటొక యబ్బురమా? నేను దమ యానతి శిరసావహించి కిష్కింధకుఁ బోవఁగనే తెలివిఁదెచ్చుకొని సకలలోకశరణ్యుఁడవగు నిన్ను శరణుఁజొచ్చుటకై వచ్చియున్నవాఁడు. ఆపన్నుఁడై యున్నవాఁడు. తానొనర్చిన యపరాధమునకై పశ్చాత్తాప మొందుచున్నవాఁడు. రామా! దీనజనశోకాపహరణ దక్షములై, రాక్షసనాశన ప్రతిపక్షములై, వేదమార్గ సమక్షములైన భవదీయ కరుణాకటాక్షముల నీదాసునిపైఁ బ్రసరింపఁజేసి రక్షింపుము. మనఃపూర్వకముగా దనప్రతిజ్ఞ నుపేక్షించినవాఁడుకాఁడు. చిరకాలము రాజ్యసుఖములు లేక వేకరుచున్నవాఁడగుటచే నవి లభించినవెంటనే మైమఱచి

తన కార్యమును జేయఁడయ్యె. నిక్కముగా వీఁడు నిరపరాధి. వీనినిఁ గాపాడుము. (అని సుగ్రీవుని రాముని పాదములపైఁ ద్రోయును.)

(అనుబంధము 5.)

సుగ్రీవ ॥ రామచంద్రా! నేను మిత్రద్రోహిని. నిక్కము. వాలిచే నపహృతరాజ్యవైభవుఁడనై, పరిత్యక్తభార్యుఁడనై యెందో యూరుపేరులేక గిరికందరములనున్న నాకు వాలిని సంహరించి రాజ్యలక్ష్మితోఁ బాటు తారాసతీరత్నమును సైత మిచ్చి కాపాడి నాకెంతయు నెయ్యుఁడు చెలికాఁడనై నాభయమును బాపినతండ్రివై, నాకోరిన వరములిచ్చిన దైవమవైన నిన్ను మఱచిన కృతఘ్నుని నన్నుఁ గరుణింపుము. దీనదయాళో! శరణాంతరము లేక నిన్ను శరణు జొచ్చితి. కాపాడుము. (అని నమస్కరించును.)

శ్రీరామ ॥ సుగ్రీవా! లెమ్ము. అభయమొసంగితి. (అని తలపైఁ జేయిడును. సుగ్రీవుఁడు లేచి నిలుచుండును.) వర్షాకాలము చనునంతలో మిత్రకార్యమవశ్యము సంఘటించెదనని వచించి యింతకాలము మనోరథములపాలై యూరకుండుట నీయట్టి ప్రియుస్నేహితునికి న్యాయమగునా! అందుకై లక్ష్మణుని నీయొద్దకుఁ బంపితి. పిన్నవాఁడగుటచే నీ లక్ష్మణుఁడు తెలిసి తెలియక నీయందాగ్రహించి పలికియుండినను వానిని మనమున నుంచకుము. లోకమునఁ గోపావిష్టులైనవారు కన్నుమిన్నెఱుంగక యేమేమియో మాటలాడుదురు. అవియంతయు నున్మత్తప్రలాపములవలె నాదరణీయ్యములు కావు. నీమనశ్శుద్ధి నేనెఱుఁగుదు. ఇక జానకిని వెదకుట మనకెంతయు నవశ్యకమైయున్నది. చూచితే సుగ్రీవా సీతా విరహముననున్న నాకీప్రపంచమే శూన్యమైనట్లున్నది?

సీ॥ రావణుండటు పెను రాయిడిచేయంగ
భయమొంది భూమిపైఁ బడియెనేమొ।
రక్కసుచేఁజిక్కి రమణిదిక్కులుఁజూచి
అకట రామా! యని యరచెనేమొ।
తన్నెందుఁబాయని తరుణిఁబ్రోవఁగమానెఁ
గ్రూరుండనుచు నన్ను దూరెనేమొ।
నాయాశవదలి తా నాయాసమునఁ నెంతొ
తల్లితండ్రులఁజాల దలఁచెనేమొ।

గీ॥ ఎందునున్నదియో సీతయెందులేదొ।
ఎట్టులున్నదొ జానకి యెందుచనెనొ।
బ్రతికియున్నదొ ప్రాణంబుఁ బాసినదియొ।
కాంతఁ జూచెదు భాగ్యంబు కలదొ లేదొ॥

అన్నా! సుగ్రీవా! ఇఁక కార్యము నాలోచింతము. శరత్కాలము సమీపించుచున్నది. ఇదే దండయాత్రకుఁ దగిన కాలము. లెమ్ము. మిత్రకార్యము చేయుము. కీర్తినిఁ జేకొమ్ము.

సుగ్రీవ॥ దేవా! ఇదే మీయానతిఁబూని యనేక పర్వత, వృక్ష, నదీగుహాలయందుండెడు సమస్త వానరసైన్యమును రప్పించి యున్నవాఁడ. వీరలలోన వీరశేఖరుఁడగు మారుతియున్నాఁడుగదా; మారుతీ! యిటురమ్ము.

(ప్రవేశము: ఆంజనేయుఁడు పద్యముఁ జెప్పుచు)

శా॥ శ్రీరామా! రఘురామ రామవరదా సీతామనఃకామ! యో।
కారుణ్యామృతరామ! భక్తజనసత్కల్యాణరామా! మహా।
వీరాగ్రేసరరామ! వేదనుత! సత్ప్రేమాభిరామా! సదా।
ధారారామ! జనాభిరామ! మునితాధామా! నమస్తేనమః॥

(అని నమస్కరించి లేచి నిలుచుండును.)

సుగ్రీవ॥ ఇతఁడు మిక్కిలి మేధావి. స్వామికార్య దురంధరుఁడు. ఇఁక సాహసబలంబుల నీతనితోఁ దులతూఁగువారు ముల్లోకములనుండుటరిది. మఱియు జాంబవంతుఁడున్నాఁడుకదా ఇతఁడతిశయవృద్ధుఁడై యున్నను మున్మూఁరీ భూచక్రంబును గోపాదంబునుంబోలె సంచరించిన మహాబలశాలి. వేయేల ఈ కపిశిఖామణులందఱు నొకరినొకరు వెనుఁదీయువారు కారు. తమయానతియైనచో వీరినిప్పుడే పంపువాఁడ. (వానరులను చూచి) వానరులారా! శతబలిగవయాదులారా మీరు తూర్పుదిశ కేగవలయు. ఇంచుకేనియుఁ గొఱఁతలేక యందున్న సరిత్సముద్రపర్వతప్రదేశములవెదకుఁడు. అచ్చట సూర్యునికి సైతము చొరరాని ప్రదేశమెంతయో కలదు. దానిని జక్కఁగా నరయుఁడు. అందా జానకీదేవి లభించెనా కొండఅందుండి మఱికొండఱిచ్చటికిఁ జనుదెంచి వృత్తాంతమునుదెలుపుఁడు. తామ్రముఖా! వాయువేగా! మీరందఱును పశ్చిమదిశ కేగవలయు. పశ్చిమకాననాంతరమ్ముందుఁ జక్కఁగ నరసి హస్తాచలముఁ జేరుఁడు. అచ్చట మందేహాది రాక్షసులున్నవారు. వారు కడుమాయావులు. వారివద్ద నారావణుఁడు వైదేహిని దాచియుండనోపు. దీర్ఘవాలవజ్రరోమాది కపులారా! మీరుత్తరదిశఁ బరీక్షింపవలయు. ఉత్తరప్రదేశమంతయు దేవసంచారయోగ్యమై యున్నను నందు రాక్షసనివాస ప్రాంత్యమునుఁ గొంతకలదు. చక్కఁగా నరయుఁడు. వైశంబవృత్తాంతమునుఁ దెలుపవలయు. జాంబవన్నీలాంగదాంజనేయాది మహారథికులారా! ఈ కార్యభారము మీయందే మోపఁబడియున్నది. ఆ త్రిలోకజననినెందున్ననుఁ గొని తెచ్చి రఘుకుల భూషణుండగు నీ రామభద్రునకు సమర్పించుట మన కెంతయు ముఖ్యకర్తవ్యముగానున్నది. మీకు రెండే కార్యములు. వృత్తాంతముఁ దెచ్చుట లేక ప్రాణములవాయుట. హెచ్చరిక. మీకందఱికిని రెండు

మాసములు గడవిచ్చెదను. కార్యముపట్ల జాగరూకులై మెలఁగవలయు. దక్షిణదిశయంతయు రాక్షసభూమి. అదే రావణ నివాసభూమియని వినియున్నాఁడను. అందునకై యతిరథ మహారథశ్రేష్ఠులగు మిమ్మందుఁ బంపఁగోరియున్న వాఁడ. మారుతీ! కార్యఫలసిద్ధి నీయాధీనమై యున్నది. దీనినెట్లు సాధించెదవో?

రామ॥ వాయునందనా! రమ్ము. ఎటుల సుగ్రీవునితోఁ జెలిమి నాకు సంఘటించి సుగ్రీవకార్యమును సాధించితివో యటులనే యీ కార్యమును సాధించి కీర్తివడయుము.

మ॥ ఎలమిన్ జానకి నెట్లుగాంచెదవొ, నీవేరీతిగుర్తించెదో।
లలి నావార్తల నెట్లుదెల్పెదొ, మనోల్లాసంబునెట్లిచ్చెదో।
పలుమారెట్టుల నూఱడించెదవొ, యాపద్భాతి నేమంబునె।
ట్లలరంజేసెదొ, యంజనాతనయ నాదాభాగ్యమెట్లున్నదో॥

నీయందేకార్యసిద్ధియు, నీయందేఫలసిద్ధియు, నీయందే నా మనోరథసిద్ధియు నెలకొల్పఁబడియున్నవి. తనయా! కార్యముపట్ల నీ బుద్ధిబలము నుపయోగించి జానకీశోకావేశ ఘునమునిఁగియున్న నన్నుద్ధరింపుము. నీవొక్కఁడవు తప్ప మఱి యెవరును నా మనోరథమును సాధించువారు లేరు. జానకి జీవించియున్నదా యనుసంశయముచేతను, ఉన్నను నెట్టి యాపదలఁ జెందియున్నదో యను ఘోర దుఃఖము చేతను, నన్ను పలవరించి పలవరించి తుదకు నిరాశచేసికొని వాయువశమున భూమిపైనొఱిగిన మల్లెతీవియఁబోలె పడి యున్నదోయను భయముచేతను బరితపించుచున్న నామానసమునకాజనకపుత్రి క్షేమవార్తయనెడు చల్లని కర్పూర సలిలముచే తడిపి ధన్యునిఁగాఁజేయుమని కోరుచున్నవాఁడ. నీవాదేవిని గుర్తించుటకై కొన్ని లక్షణములఁ జెప్పెదవాఁడ. ఆ జనకరాజతనయను నీవిదివఱకే చూచియున్నాఁడవు. ఆ

యిందుముఖి నారచీరలు ధరించియుండు. పరమసాధ్వీమతల్లి కావున దేహసంస్కారంబుల వదలియుండును. అనవరత మస్మద్ధ్యాన పరాయణయైయుండనోపు. ఆ సతీతిలకముఖార విందమున పరమసౌభాగ్యలక్షణముల సూచించెడు పద్మాదిరేఖలు చూచువారికి నిత్యశ్రీవిలసమును జెప్పక చెప్పుచుండును. నేత్రరాజీవంబులు కడువిస్తారంబులై నిరుపమాన రక్తరేఖాంకితములై యసమాన సాధ్వీగుణములఁ జాటుచుండును. ఇంపారు మరువిండ్లఁబోలు కనుబొమల మధ్యసీమలందు సముంచిత లోకజనయిత్రీగుణముల సూచించు చిన్నని మచ్చయొకటి కలదు. మఱియు నవయవములందలి సుకుమారత్వమును లక్షణములను నీకిదివఱకే తెలిపియున్నాఁడను. అట్టిసాధ్విని నీవు గాంచినపుడు నిన్నొక రాక్షసునిగ భావించి శంకించునేమో? రాక్షసమాయగాఁ దలంచునేమో? ఇదే తత్సంశయ నివారణమునకై యీ ముద్రాంగుళీయ్యకము నిచ్చెద. దీనినిఁ బ్రదర్శించితివేని యాదేవి, నన్నుఁ గాంచినట్లుగా సంతసించి నీయం దధికవిశ్వాసమును, పుత్రవాత్సల్యమునుఁ జూపఁగలదు. (ఉంగరమిచ్చి) కుమారా! నా వాక్యములుగా నా జానకివద్ద యీమాటలనాడుము. "నీచే వియుక్తుఁడై యనవరతము నిన్నే ధ్యానించుచు అధిక ప్రయాసతో నీ రాముఁడు ప్రాణముల భరించినాఁడ"నుము. "నీ నిక్కవములు తెలియకుండుటచే నినుఁగొని తెచ్చుటకే ప్రయత్నములు చేయుటకును దోపక శక్తివిహీనుని చందమున నున్నాఁడ"నుము. "ఎట్లైనను వృత్తాంతము తెలిసినవెంటనే రావణుని సంహరించి నిన్ను స్వీకరింతున"ని వచింపుము. "ఖరదూషణాదుల వధించిన బాణములంతటితోఁ దనివి నొందక రావణ ప్రాణహారణంబునకు వేచియున్నవ" నుము. ఎట్లైనను నేనచటికి వచ్చువఱకు జీవితము భరించియుండు మనుము.

సీ॥ నిన్నుఁబాసినదాది నిమిసంబుయుగముగాఁ
గడుపురాముండని నుడువవన్న ।
నెఱ పహోరాత్రముల్ నీధ్యానమేగాక
తలపఁడు వేఱంచుఁ దెలుపవన్న ।
నీజాడఁదెలియక నెలత ! నిఁ రక్షింపఁ
దప్పెరాముండంచుఁ జెప్పవన్న ।
వాలిఁగూల్చినబాణ మోలి రావణుఁజంపఁ
దివిరివేచినదటంచుఁ దెలుపుమన్న ।

గీ॥ ఇంతలోనన నీచెంత కేగుదెంచి ।
చంపురావణునంచు వచింపుమన్న ।
భయమువలదంచు నూఱడఁ బలుకుమన్న ।
పోయిరావన్న శుభములఁబొందుమన్న ॥

రాజ ॥ రఘుకులభూషణా! లోకవంద్యుఁడవైన నీ కృపారస మొక్కటి యుండవలయుఁగాక యెట్టికార్యమైనను నవలీలఁ వారము. పాతాళము భేదించియైనను, స్వర్గంబు నరసియైనను, సప్తసాగరంబుల గలఁచియైనను, సకలధారుణీచక్రమన్వేషించి యైనను, నక్షత్రమండలంబంతయు వెతకియైనను, ఆజగన్మాతయగు సీతనుఁ గొనివచ్చెదము. మొన్న యీరావణుఁడా దేవినిఁదీసికొనిపోవుచున్నతఱి కొన్నిభూషణముల నామెయే క్రిందవైచియుండెఁగదా. వాటినిఁబట్టి యామె లక్షణంబుల నించుకంత యెఱిఁగియున్నాను. తామాలోచింపకుఁడు. ఆశ్రయించినవారి యజ్ఞానంబుఁ దొలఁగించి యెంతయో విజ్ఞానమొసఁగు భవాదృశమహనీయ్యులిట్లు పామరమొం దఁదగునే? ..

సీ॥ విధివశంబునఁగల్గు వెతలకై మిముఁబోలు
పూజ్యులు వగనొందఁబోలదయ్య ।
కడచనునింతలో కష్టముల్ తిరములే
దీనికై తపియింపఁ దీఱునయ్య ।

పదునాల్గులోకముల్ వెదకి నేజానకీ
దేవి సేనుస్ఫువార్తఁ దెత్తునయ్య॥
ప్రాణంబులైననుఁ బాసెద నేగాక
ఊరక నీచెంతఁ జేఱనయ్య।

గీ॥ కడగి ననుఁబోలుబంటులు కలిగియుండ।
నంతనీవొండ నంతేమివచ్చెనయ్య।
చాల నీదయయొక్కటే చాలునయ్య।
పరగ నాశీర్వదించినఁ పనుపుమయ్య॥

(అనినమస్కరించిలేచి)

ఇందు చేరియున్న నీ దాసులగు నీ వానరులందఱు నొక్కరొక్కరొక లోకమేలఁజాలుదురు. కార్యసిద్ధి యవశ్యము కలుఁగును. మాకు శెలవొసంగుము. కార్యము సఫలమైనదనియే తలంపుము. ఇదే పోయివచ్చెదము. (అని యందఱును నమస్కరింతురు.)

(యవనికపడును)



# విభీషణ పట్టాభిషేక నాటకము.

## ప్రథమాంకము.

### తృతీయరంగము—సముద్రప్రాంతారణ్యభూమి.

[ప్రవేశము : ఆంజనేయుఁడు, నీలుఁడు, అంగదుఁడు, జాంబవంతుఁడు మొదలగుకపులు పాడుచు)

(అనుబంధము 6)

అంగద ॥ వానరవీరులారా! సీతాన్వేషణమునకై మనమెన్నెన్నియో కష్టములఁబడితిమి. ఈ రెండుమాసములు సుగ్రీవుఁడిచ్చిన గడువుఁగడిపితిమి.

ఉ॥ కాలమదెంతయోకడఁచె కాననసీమచరించి యెంతయో।
తాలిమిదేవినిన్వెదకి తగ్గియు వేసరియున్నవారమా।
కాలమదెట్లువచ్చు నవకంజదళేక్షణ జానకీసతిన్।
శీలవతీమణిన్ కనఁగ చెల్వగుభాగ్యముఁ గల్గుకాలమున్॥

మనకు జానకిలభింపదయ్యెను. సుగ్రీవునియాజ్ఞయందమా మహాఘోరము. లోకైకవీరుఁడగు నారామచంద్రుని యాజ్ఞయునట్టిదియే యగు. వీరికి యాజ్ఞాభంగముఁ గలిగించితిమా మనముమడియుటయే కష్టము. ఎట్లును మనకు దుఃఖకాలమే కలిగినది. సీతాదేవి దొరకలేదని సుగ్రీవునితోఁ జెప్పినవెంటనే మనకుఁజెప్పకయే మనప్రాణములు చనఁగలవు. వ్యర్థముగా నచ్చటికిఁబోయి ప్రాణములవిడుచుటకంటె అక్కడ కాన్పించుచున్న మహార్ణవమునఁబడి ప్రాణములఁబాయుటయే యిప్పటికి మేలని నాకుఁదోఁచుచున్నది.

చ॥ రవికులవార్ధిచంద్రుఁడు రురాజితశాసనుఁ డత్యనల్పుఁడా।
రవిసుతుఁడన్యభీకర దురాసదశాసనుఁ డెన్నిచూడనా।
భువనమనోహరిన్ జనకపుత్రినిగాంచిన సేమవార్తలన్।
తవిలివచింపకున్నఁదమతావులుతప్పను పంచవాయువుల్।

నీల॥ అంతయేమి వచ్చినది? మనమొక్కరమా సీతాదేవిని వెదక వచ్చినవారము? ఎందఱెందరో యెన్నెన్నిచోట్లనో వెళ్ళియున్నారు. అందెవరైన నాదేవినిఁజూచియే వచ్చియుందురు. ఇప్పుడు మనము ప్రాణముల వాయునంతపనియేమి?

ఉ॥ రాజసుతుండవీవు పరిరాజితభాను సుతాత్మప్రేమనం।
రాజనుఁడీవు నీకుభయరావితసూక్తు లవేలయంగదా।
రాజసుతుండుఁ జేయునపరాధము లెంచరుఁగాదెయెవ్వరా।
యోజనయేల బీదలకయోమహినోర్వను సర్వదుఃఖముల్।

జాంబ॥ సరి సరి. నీవెందుంటివో. వెదకఁబోయినవారందఱు నా దేవినిఁజూడలేదని సుగ్రీవునితో నప్పుడే చెప్పలేదా? అతఁడు మనమేమో యఘటనఘటకులమని మనపై నెంతయో యాశ పెట్టుకొని మనలనుఁ బంపలేదా? ఊఱక తెలియక మాట్లాడిన నేమి ప్రయోజనము?

అంగద॥ అట్లైన మనకీసముద్ర మేశరణమా! ఆ వైదేహిక్షేమ వార్తఁదెలియక రాముఁడెంత పరితపించునోకదా? పది యెట్లున్నను సుగ్రీవుని కోపానలంబునకు మనప్రాణంబు లాహుతులుఁగాక మిగిలినఁగదా యందఱి యాలోచన?

చ॥ తలఁపరుయోగ్యభావనల ప్రేమమునెన్నరు మిత్రబంధులన్।
తలఁగకమోసగింతురటు తల్లినితండ్రినినైనఁజూడరా।
కలుషమునెంచరాత్మపరికాంక్షింత విత్తమునిచ్చిరేనిధా।
త్రులుధనమోహచిత్తులకుఁ దోచునెధర్మవివేకసత్కృపల్॥

తారా ॥ యువరాజా! మాకందఱకు మరణమే శరణము. నీవేల మృతిఁజెందెదవు? నీవు సుగ్రీవుని కుమారుఁడవు. అందును యువరాజువు. ఆకపిరాజెట్టులైన నినుక్షమించును. నీవు కిష్కింధకుఁబోయి సుఖంబున నుండుము.

చ॥ ఘనతరవిక్రమాఢ్యులు వికస్వర కార్యవివేకదక్షులా।
వనచరనాథుభానుసుతు మానితదూత లదెందరోభువిన్ ।
జననిని జానకీసతిని సర్వమహీధర వృక్షపట్టణా।
వనితలమందుఁజూచి శుభవార్తలఁదెత్తురదేలచింతమా।
కనఘసుధీశులార! ప్లవగాధిపులార! తలంచిచూడరే॥

అంగద ॥ మీకేలయీభ్రాంతి? ఇది పాపమేయని యించుకైన నాలోచింపక, అపకీర్తికిఁ గొంచెమైన సంకోచింపక, అన్నయగు వాలినిఁజంపి, తత్పత్నియగు తారాదేవిని బరిగ్రహించిన పాపాత్మునకుఁ గరుణయెక్కడిది? ప్రేమయెక్కడిది? ధనపిశాచముపట్టిన నెట్టిబుద్ధిమంతుఁడైనను, పండితుఁడైనను పాపకార్యమునకు వెనుదీయఁడు. ఇంచుక ధనమిచ్చెదనని చెప్పిన నెంతటివివేకిమైనను మితిలేని యాశకులోనై తన ప్రాణస్నేహితులనైనవిడిచి, శత్రువులకైనైనలోఁగి, ప్రజలలోఁ దలవంపులైనను సంకోచింపక, యెట్టిహీనకార్యమైనను చేయును. కావున ధనపిశాచ బాధితుఁడగు సుగ్రీవునకు మీకంటె మొదట నేనుబ్రతికియుండుట యిష్టముండదు. నేనును మీతోఁగూడి కొండలనుండియో, వృక్షముల నుండియో, లేక మహాసముద్రముననో, ప్రాణముల విడిచెదను. కిష్కింధకుఁబోయి యాసుగ్రీవునితో నేలచావవలయు?

మ॥ ధరణీనందన భవ్యవర్ణనసుధాధారా సువర్షానుసం।
చరణంబుల్ ఘనముల్ రఘూద్వహమహాప్రాణావనీసస్యముల్
తరమేనిల్వఁగ గ్లానిఁజెందకను గోత్రాపుత్రికాక్షేమముల్ ।
పరివర్ణింపకయున్న నక్కటకటా భావింపఁగా దైవమా॥

ఆంజ॥ అంగదా! మనకు రామకార్యము ఘటించి, యానుజనాథి రాముని, జానకీమనఃకాముని, రామునిసేవించి యతని కామోదముఁగలిఁగించు భాగ్యమే లేదయ్యె. ఇఁక మనము రామకార్యదురంధుకులమై, శరీరప్రాణంబు లారామభద్రున కై యొప్పగించి, యంతమంకు విష్ణుసాయుజ్యమందుటకైన నర్హులము కాకఁబోతిమికదా? అయ్యో! అట్టిప్రాప్తి మన కేలఁగల్గు? రామసేవాప్రయాసమునఁ బ్రాణములువిడుచు భాగ్యము కలుఁగుటకు జన్మజన్మాంతర సుకృతముండవలయుఁ గదా? తిర్యక్పక్షికులమునఁబుట్టినను నాజటాయువు మొన్న జానకినపహరించి, రామద్రోహమొనర్చిన రావణునెదిరించి శ్రీరామకార్యార్థమై తన ప్రాణంబులనే ధారపోసె. అతఁడే ధన్యుఁడు. అతనిదే జన్మము. మనకట్టిభాగ్యము కలుఁగ దయ్యెఁగా?

(అనుబంధము 7.)

(ప్రవేశము : సంపాతి దూరమున)

సంపాతి॥ ఔరా! నేఁడు నాయాయాసమంతయుఁదీరె. నరమాంసము రుచిచూచి బహుకాలమైయుండెను. నేఁడునాభాగ్యవశమున నది లభించెను. వీరినందఱి నొక్కొకడిగా నెత్తుకొనిపోయి భక్షించెదఁగాక. ఆహా! ఏమి యాశ్చర్యమో కాని యింత కాలమునకు నాసోదరుఁడగు జటాయువు వృత్తాంతమువినఁ గంటిని. వీరెవ్వరో తెలియదు. వీరు నామిత్రులైనను గావచ్చును. కావున వీరినిఁజంపకూడదు. ఆ జటాయువునకై రాత్రింబవలు పరితపించుచున్న నామానసంబున కించుక యాప్యాయమానంబుకలిఁగె. వీరినడిగి నాతమ్ముని వృత్తాంతము సవిస్తారముగాఁ దెలిసికొనియెద. (సమీపమునకు వచ్చి) అయ్యలారా! మీరెవరు? మా జటాయువు వృత్తాంతము మీకెట్లు తెలియును? అతఁడు నా తమ్ముఁడు. ఎంతయోకాలమునకు చల్లఁగ వీనులార నీవృత్తాంతము నే వినఁగంటిని. తెల్పుఁడు జటాయువెందున్నాఁడు?

అంగద ॥ అయ్యా! మేము రామదూతలము. సుగ్రీవుని [illegible] సీతాన్వేషణార్థమైవచ్చి యెచ్చటను నాదేవినిఁగాంచక పరితపించుచున్నారము. ఇఁక నీవురాక్షసుఁడవో, పక్షిరేఁడవో తెలియదు. ఆజటాయువు కొంతకాలముక్రిందట శ్రీరాముని దేవియగు జానకీదేవినిఁ గొనిపోవుచున్న రావణునెదిరించి యద్భుతముగాయుద్ధమాడి తుదకు వీరస్వర్గమందెను.

సంపాతి॥ హా! జటాయువు! హా! సోదరా! (మూర్ఛిల్లిలేచి) కపివీరులారా! మీరువచించిన శ్రీరామవృత్తాంతమున నాకు రెక్కలు వచ్చినవి. నారెక్కలు కాలినతఱి యొకముని "రామవృత్తాంతము విన్నతోడనే నీకురెక్కలు వచ్చు"నని చెప్పియుండెను. అయినను నేను సంతసింపను. నాయనుంగు తమ్ముని నీజన్మమునఁ గాంచలేకపోతిని. మేమిరువురు నొక్కనాఁడు సూర్యమండలము చెంతకుఁబోవ నాజటాయువు రెక్కలు సూర్యకిరణములచేత దగ్ధములయ్యెను. నేనాతని నాపక్షములలోదాఁచి రక్షించితినిగాని యంతలో నాపక్షములు సైతము కాలఁజొచ్చెను. నేనెందోపడితిని. జటాయువెక్కడికో పోయెను. ఇప్పటి కాతని వార్త తెలిసెను. ఏమి చేయుదు? నేనిప్పుడేపోయి యారావణునివధించి నాతమ్ముని పగఁదీర్చి, సీతాదేవిని రాముని కిచ్చుచుంటినిగాని సోదర మరణంబున నాకేమియుఁ దోపకున్నది.

అంగద ॥ పక్షీంద్రా! అదిలేకున్నసుమానె. ఆసీతాదేవి యెందున్నదో చెప్పఁగలవా?

సంపాతి॥ నిక్కముగాఁ జెప్పఁగలను. నేను దగ్ధపక్షుఁడనై యున్నతఱి నాకుమారుఁ డాహారాన్వేషణార్థముపోయి రావణుని నా దేవినిఁగాంచివచ్చెను. మేము గరుత్మంతుని సోదరుల మగుటచే ననేకశతయోజనంబు లెగురుటకు మాకుశక్తికలదు.

ఇదె నాకంతయుఁగాన్పించుచున్నది. మానేత్రముల కనేక శతయోజనములదూరము చూచు శక్తియుఁగలదు. కావునఁ జెప్పెదవినుండు. ఈ దక్షిణసముద్రముదాటిన నవ్వల లంకాపట్టణముకలదు. అందు రావణుఁడు సీతాదేవి ననేక రాక్షసస్త్రీ పరివారముతో నుంచియున్నాఁడు. మీరందఱు పోయిన నాదేవినిఁ జూడఁగలరు. నాకుఁదడవయ్యె. నేస్నాన మొనర్పఁ బోవలయు. పోయివచ్చెద.

(నిష్క్రమము.)

కపులు ॥ (అనుబంధము 8.)

(నిష్క్రమము)



# విభీషణపట్టాభిషేక నాటకము

## ప్రథమాంకము.

### చతుర్థరంగము—సముద్రప్రాంతము.

(ఆంజనేయాదికపులుందురు)

అంగద॥ వానరులారా! సంపాతి తనచరిత్రమంతయుఁజెప్పి సీతాన్వేషణమార్గమునుఁ జెప్పియున్నాఁడుకదా? ఈసముద్ర మపారమై, యలంఘ్యమైయున్నది. శతయోజన విస్తారంబగు నీ పారావారంబునుదరించుశక్తి మనలో నెవ్వరికిఁ గలదో తెలియదయ్యె. అయ్యో! సముద్రమనఁగనేమి? దాటుటనఁగనేమి? తెలియక యెంతప్రయోజనమో తెలిసియు నంతయే ప్రయోజనమయ్యె.

ఉ॥ వానరవీరులార! యసమానమపారము నీపయోధిమ।
న్మానసమందుఁజూడ ననుమానముఁగల్గెను దాటిపోవఁగా।
మానుగశోకసంద్రమును మానఁగలేని విధంబుఁదోఁచెనో।
మానితవేగులార పనియెయ్యది మాకుఁదలంచిచెప్పరే॥

జాంబ॥ ఊరకచింతిల్లవలదు. కార్యముపట్లన ధైర్యముపడినఁ బ్రయోజనమేమి? ధైర్యోత్సాహమునఁగార్యము నెరవేర్పలయును గాక. మనమిప్పుడు మనలో నొక్కొక్కరి శక్తినిఁబరీక్షింపవలయును. గజా! చెప్పుము. నీవెన్నియోజనముల నెగరఁగలవు; ఇదివరలో నెగిరియున్నావు?

గజ॥ అయ్యలారా! నాకీ సాగరమును లంఘింపవలయుననెడి యుత్సాహముమాత్రము కలదుగాని నాశక్తిమాత్రము ముప్పదియోజనములు దాటునంతకలదు.

అంగద ॥ నీలా! ఇది యాత్మప్రశంసయని యెంచక నీ లంఘనశక్తి నింత తెలియఁబఱుపుము.

నీల ॥ నలువది యోజనములు నిరాటంకముగ లంఘింపఁగలను.

అంగద ॥ గవయా! నీవేమందువు?

గవయ ॥ అతిశయముగఁ బ్రయత్నించిన నేబది యోజనములు దాటఁగలను.

అంగద ॥ గవాక్షా! సమయము వచ్చినది నీసామర్థ్యమునడుగుటకు.

గవాక్ష ॥ దేవా! ఈ సముద్రోల్లంఘన శక్తి నాకు సంపూర్ణముగ నుండిన నేనూఱకుండియుందునా? చెప్పనేవలయునన్న డెబ్బది యోజనముల నెగరఁగలను.

అంగద ॥ జాంబవంతా! నీవు మాకందఱకును బితామహుఁడవు. అంతియకాక పితామహునుండి లోకహితార్థమై యుద్భవించినవాఁడవు. సూర్యునిగూడి యొక్కతూరి భూవలయంబును ప్రదక్షిణమొనరించిన నీకీ మహోదధి యొక పిల్లకాల్వయేకదా? నీవు కడువృద్ధుఁడవయ్యు నిన్నే యీ కార్యమునకుఁ బ్రార్థింపవలసివచ్చినది.

జాంబ ॥ కుమారులారా! చిన్ననాటిసంగతులిప్పుడు పరిహాసాస్పదములు. పెండ్లినాటి ముచ్చటలు లంఘణమునఁదలఁచుకొన్న నేమి ప్రయోజనము? చిన్నతనమున సప్తసముద్ర పరివేష్టితమగు నీభూవలయమును లంఘింపఁదలచి సూర్యరథము వెంట నుదయాద్రినుండి యస్తాద్రివఱకు కడు వేగమున లంఘించుకాలమున నా మోకాలునొక పర్వతము క్రుచ్చుకొనియున్నందున నేను సంక్రమణమున కిప్పుడు మిక్కిలి యయోగ్యుఁడను. అయిన తొంబది యోజనములు దాటఁగలను.

అంగద ॥ అయ్యో! ఇచ్చటి కపివీరులందఱును సముద్రమధ్యమం దున్నవారుగాని సముద్రమునావల నొక్కరునులేరైరే? ఇఁక నాశక్తిచూచిన నే నేమహాసముద్రమునైన దాటి యావలచేరుదునుగాని మరలివచ్చుట కొంచెమనుమా నాస్పదము. ఏమి చేయుదు? అకటా! ఎంత తెలిసిననేమి? మన సాహసమంతయు భస్మహోమప్రాయమయ్యెఁగదా?

జాంబ ॥ కపిశ్రేష్ఠులారా! ఇంటిమణిదీపమునువిడిచి వేరుదీపమును వెదకినట్లున్నది మన యాలోచన. కంటిరే యీ యాంజ నేయుని? ఇతఁడే మనకాధారము.

అంగద ॥ ఔను. మనమెంత భ్రాంతులమైతిమి? ఏ మహనీయుఁడు పుట్టినమూఁడవనాఁడే మార్తాండమడలమునుఁ బుట్టచెండును వోలె నాడించెనో, ఏ ధీరుఁడు సంక్రందన ఘోర వజ్రధార కెంతయు నవమానముఘటించెనో, యెవ్వాఁడు నవవ్యా కరణ సంస్కార సంపన్న మహాపండితుఁడని ఖ్యాతిఁ జెందె నో, యట్టి ధీసారుని, యలఘువిచారుని, నగధీరుని, యీ యంజనాకుమారునికన్న మనకు వేరాధారముకలదే?

సీ॥ పసిబాలుఁడై యెవ్వఁడసియాఁడుసూర్యునిఁ
బుట్టచెండునుఁబోలె పట్టఁదొడగె।
పర్వతంబులశీల్చు పాకారివజ్రంబు
ఘనశక్తి నెవ్వాఁడు నణఁగఁజేసె।
పైవచ్చురాహువు పైఁబడియెవ్వాఁడు
నేరడిపండని చేరికొనియె।
వరశక్తినెవ్వాఁడు బ్రహ్మను మెప్పించి
చిరజీవిఁగమ్మని వరముఁబడసె

తే, గీ॥ అట్టి నగధీరు, సువిచారు, నమితసారు।
నిరుపమాకారు, పాపౌఘ నిరతదుర్గు।
వరగుణోదారు, నంజనావరకుమారు।
పరగఁబ్రార్థింప మనకింక కొఱఁతగలదె॥

మహాత్మా! ఏమిట్లూరకున్నాఁడవు? శ్రీరాముని సమగ్రకార్య మంతయు నీయందే గదా మోపఁబడినది? దానికిఁదోడు మాయందఱి పంచప్రాణములసైతము భవన్మస్తకమున మోపువారము. లెమ్ము. కార్యము సాధింపుము.

(అనుబంధము 9.)

ఆంజ॥ కపివీరులారా! నాయందలి యాదరణముచేత నన్నింత గొప్పఁజేసెదరుకాని మీయెదుట నేనెంతటివాఁడను? ఐనను భవాదృశ వీరాగ్రణులందఱును ననుగ్రహించి నన్నొకకార్యమునకుఁబనుచుటచే నాకెక్కడలేని బలమును, నిట్టి సముద్రమునుఁబోలిన వేయింటి నవలీలదాటుజవమునుఁ గల్గించుచున్నది. ఇఁక యీ సముద్రమనఁగనెంత? నన్నాశీర్వదించి పనుపుఁడు. నిమేషమాత్రమున నభంగతుంగ తరంగరంగంబగు నీసాగరంబును నొక్క కాల్వవలె దాటి, లంకనుఁజొచ్చి, జానకీమాతనన్వేషించి, యాదేవిని దోడ్తెచ్చి రామునకర్పించెద. అందాతల్లి యెుందువిధమైయుండెనేని రావణాది క్రూరరాక్షససమేతంబుగ లంకాపట్టణమును నగలించి మదీయ్యవాలంబునఁగట్టి సముద్రంబున గలిపెద. శీఘ్రకాలమున కార్యసిద్ధిఁగొని మిమ్ముఁ గలిసికొనియెద. లంకయెుక్కటియేకాదు. పాతాళపర్యంతంబు వెదకి సీతామాత యెందున్ననుఁ గొనితెచ్చెద. భవత్సేవకుఁడుండ మీరింత విచారింపవలయునా? నాకు సెలవిండు.

జాంబ॥ ఆంజనేయా! నీకేమని చెప్పుదును? జ్ఞానమహిమయందును, కార్యవిచారమునందును, నీకు నీవేసమానుఁడవు. పోయిరమ్ము. శుభమయ్యెడు! నీరాకకై మేమందరమెదురుఁ జూచుచుందుము. శీఘ్రమునమరలివచ్చి మాకుసంతసమిమ్ము.

సీ॥ అనఘ రాముఁడునిన్నుఁ దనబంటుగాఁగొని
మదినిశోకముమాని ముదముఁగనఁడె।
సుగ్రీవుఁడును నీదు సురుచిరమైత్రిచే
ఘనరాజ్యసుఖమును గనఁగలేడె।
మేమెందఱమొయున్న ప్రేమజానకివార్త
వినుపింపుమని నిన్నుఁబనుపలేదె।
సౌమిత్రి తనమాట యామహాతల్లికి
వెలయఁజెప్పుమటంచు వేఁడలేదె।

గీ॥ పరగ వారిధి నీకెంతపాటియయ్య।
నిన్నుఁబోలెడు ధీరుండు నెవ్వఁడయ్య।
జాగుచేయక పయనంబుఁజాటుమయ్య।
చెలఁగి మమ్ముల ధన్యులఁజేయుమయ్య॥

అంగద॥ అంజనాతనయా! రాక్షసులు కడుమాయావులు. మిక్కిలి కనుగల్గిమెలఁగవలయు. ఆజనకతనయ శోకావేశంబునఁ గృశించి యుండును. ఆమెను మిక్కిలి నిపుణముగాగుర్తింపవలయు. అందు నీకేమైననపాయము కలిగెనా యొక సింహగర్జనం బొనర్పుము. ఎటులైనను నేను నిన్నుఁజేరెదను. నీకు పవన సూర్యాదులందఱును శుభంబిత్తురుగాక. అదే యందుఁ గాన్పించు మహేంద్రాద్రినెక్కి ప్రయాణముకమ్ము.

ఆంజ॥ భాగ్యము.

(నిష్క్రమము.)

(వెనుక యవనికనెత్తగా సముద్రము కాన్పించును. అంజనేయుఁడు పాడుచు దానినిదాటును.)

(అనుబంధము 10.)

యవనికపతనము.



# విభీషణపట్టాభిషేక నాటకము.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము—లంకాపట్టణప్రాంతము.

(అనుబంధము 11.)

ఆంజ॥ ఔరా! ఇయ్యదియే లంకాపురము. ఈదుర్గమహేమదుర్గంబులేమి! ఈ మణిమయగోపురంబులేమి! ఈ యపారభాగ్యసంపదలేమి! కన్నులపండువొనర్చుచున్నవిగదా. భూమియందు చతురాననుఁడు సృజించిన సకలపట్టణంబులకీలంకయే మాతృపురంబగును! ఇఁక నిట్టి పట్టణంబేలు రావణువైభవమెట్టులుండును! సమీపమునకే వచ్చియున్నానుగదా? సముద్రమునరాయబారమేల? ఇందాజానకినిఁ గాంచుటెట్లు? చూచెదఁగాక. అల్లదే చంద్రోదయమగుచున్నది. ఇదియేసమయము. ఈపట్టణమును బ్రవేశించెదను.

(యవనికనెత్తగా పురముకనుపించును. ఆంజనేయుఁడు ప్రవేశింపఁబోవ ఘోరాకారముతో లంకిణియెదిరించును.)

లంకిణి॥ ఓరీ! ఎవ్వఁడవురానీవు? ఈయర్ధరాత్రమున దొంగవలె లొంగి పోవుచున్నాఁడవు. ఈపురి రాక్షసేశ్వరుఁడైన రావణుని నెఱుంగవా? ఇందేలవచ్చితివి? వచ్చితివననేల; చచ్చితివన్ననుసరియే.

ఆంజ॥ నేనొక్కరుఁడ. ఎవ్వరైననీకేమి? ఈపురి నద్భుతంబగు ధరణీజాత ఫలంబున్న గ్రహింపవచ్చితి. నీవెవ్వరు? ఇట్లేల నన్నడ్డగించెదవు? దారివిడువుము. మొదట నీవ్వెవరో యెఱిఁగింపుము.

లంకిణి ॥ ఈపట్టణము విశ్వకర్మనిర్మించెను. దానిరక్షించుటకై బ్రహ్మనన్ను సృజించెను. నాపేరు లంకిణియందురు. రావణుని యాజ్ఞనున్నదాన. ఇఁక నీవృత్తాంతముఁ దెలుపుము.

ఆంజ ॥ నేనువానరుఁడ. ఈపురిఫలములు మిక్కిలి మధురములని విని వాటినపహరింపవలయునని వచ్చినవాఁడ.

లంకిణి ॥ వచ్చినదోవపట్టుకొని పోయెదవా నేను యమపురిదోవ కనుపుదునా? బ్రతుకఁదలఁచితేని మారుమాటాడక వెడలి పొమ్ము.

ఆంజ ॥ నాకార్యము సమకూరిననపిదప నొకనిమిషమైన నుండను. అంతవఱకు నీవు చచ్చిపుట్టినను పోవను.

లంకిణి ॥ దురాత్మా! ఐనఁజచ్చితివి. (అనుబంధము 12.)

ఆంజ ॥ రాక్షసీ! స్త్రీవని యుపేక్షించి మాట్లాడినట్లంతయు నీ గర్వము హెచ్చాయెఁగా? నీకుబుద్ధి చెప్పిన ఫలములేదు. నీ దేహమునకు బుద్ధిచెప్పెద. ఇదేచూడుము. (అని ముష్టిఘాతమున మర్దించును. లంకిణి యరచుచు క్రిందఁబడును.)

లంకిణి ॥ అయ్యా! మహాత్మా! నీవెవ్వఁడవో మహనీయుఁడవు. నేను నీచేజయింపఁబడితిని. నేను సురాసురులకైన నజేయను. నన్ను సృజించిననాఁడు బ్రహ్మ “నిన్నొకవానరుఁడు వ్రేల్మిడిజయించును. అదియే లంకావినాశమునకుఁ బ్రారంభమ”ని నుడివెను. నీవు నన్ను నిర్జించితివి. ఇఁక రావణుఁడు సపుత్ర మిత్ర కళత్రముగ నాశనమయ్యెననియే తలంపవలయును. నీవు సులభముగా లంకలోఁ బ్రవేశించి నీమనోరథము నెఱవేర్చుకొనుము. ఇంక లంక నశించినదియే. అవసానకాలమున జనించిన మహావ్యాధిని నేవైద్యుండును గుదర్పఁజాలఁడు. పొమ్ము. నీకు శుభంబగుఁగాక.

(లంకిణిచచ్చును. ఆంజనేయుఁడు నిష్క్రమించును.)

(యవనికపడును)

శ్రీ

# విభీషణ పట్టాభిషేక నాటకము

## ద్వితీయాంకము—ద్వితీయరంగము.

లంకాపట్టణము.

[ప్రవేశము: ఆంజనేయుఁడు.]

(అనుబంధము 13.)

ఆంజ॥ ఆహా! ఏమి యీపట్టణవైభవము. ఎచ్చట తిలకించినను రమణీయదేవాలయములు! ఎందు పోడఁగాంచిననుఁ జిత్రశాలాపరిశోభిత కూటాగారములు! ఏవైపునవీక్షించినను రాక్షసపుంగవ వేదపాఠములు! ఇంత దుష్టకర్మనిందనీయులగు రాక్షసులపురమునకై నాప్రభులక్ష్మి తల్లికేల యింతటి కరుణగలిగెనో తెలియదు. అందుకే లోకమున దుర్జనులకు మహాభాగ్యసంపత్తియు, సజ్జనులకుఁ జిక్కని దారిద్ర్యమును దైవముకలిగించునట నిజమని యిప్పుడునాకుఁ దెలిసెను. ఈవీధుల ప్రతిభవనంబునను హోమములేమి; యజ్ఞయాగాదిక్రతువులేమి; వేదాధ్యయన ఘోషయేమి. ఇదియంతయుఁ జూడ నీలంక పుణ్యపాపములకు రెంటికిని నిలయమని తోచుచున్నది. నేనీపురమంతయుఁ బూసవెదకినరీతి నన్వేషించితినిగాని యొక్కచోటనైనను మాసీతాదేవినిఁ గాంచనైతిని. అక్కటా! మా రాముదేవినిఁగాంచి శ్రీరామకార్యము ఘటించు పరమభాగ్యము నాకుఁగలదో లేదో తెలియదు.

ఉ॥ కరుణాపూర్ణవిలోకనాంచితమునై, కల్యాణసంధానమై।
వరసాధ్వీసహజానుభావ వినయప్రఖ్యాత మాధుర్యమై।
తరుణాబ్జాంచితమై మనోదయిత నిధ్యానానుసంధానమై।
యరుదౌజానకిదేవిమోముఁగనఁగానా భాగ్యమెట్లున్నదో॥

అచ్చట నొక భవనము కనుపించుచున్నది. దానివెదకిగాని యేమాలోచించుటకును వీలులేదు. పోయిచూచెద.

(నిష్క్రమము)

(యవనికయెత్తగా రావణుఁడు పరుండియుండును)

(ప్రవేశము; ఆంజనేయుఁడు)

ఆంజ॥ ఓరా! ఇతఁడేకాఁబోలు రావణుఁడు! అనేకకోటి సూర్యప్రభాసముదయముఁబోలె ఈతనిముఖము తేజముచే మిరిమిట్లుఁగొలుపుచున్నది. కర్ణాంత విశ్రాంతములై, మూసియు సమంచితరాజసంబు తోపఁజేయు వీని నేత్రము లీపదునాల్గులోకంబుల నేలఁజాలు. దీర్ఘములై, క్రూరభుజంగమ సమానంబులగు నీరాక్షసరాజుయొక్క యిరువదిబాహువు లెంతయు శాత్రవభయంకర పరాక్రమలక్ష్మినిఁ జెప్పకచెప్పు చున్నవి. ఈపదిమోముల ఫాలతలములందు నలరారు భస్మత్రిరేఖ లనవరతశివపూజాభక్తి మహిమంబును నెల్లెడఁ జాటుచున్నవి. భళిరే! ఈతనిగాంభీర్యము! అయ్యారే! ఈవీరునియంగంబులరీతి! ఈరావణుఁడీ లంకనేల? ముల్లోక ముల నేలఁజాలు. ఈదానవేశ్వరుని విశాలవక్షములందు మున్ను ఐరావతముతోఁ బోరినప్పటిగుర్తు లింకనుఁ గను పించుచున్నవి. అకటా! ఎంతయుండియు నేమిప్రయో జనము? వీనిపాపకార్యములవలన వీఁడులోకకంటకుఁడని నిం దింపవలసియున్నది. వీనిబాహువులయందు విష్ణుచక్రమునుఁ బరీక్షించిన చిహ్నములు కనుపించుచున్నవి. ఎంతపరా క్రమవంతుఁడైననేమి? ఎంతవిద్యావంతుఁడైననేమి? ఘోర నీచ పాపకార్యముఁ జేయువాఁడు సర్వలోకనిందనీయుఁ డేకదా? చుట్టునున్న యాతరుణీమణులందఱును దేవ సుందరులు కాఁబోలు? వీరిలో మాజానకీదేవి యెందున్నదో చూచెదఁగాక. (కొంతవడిపరిశీలించి) అయ్యో! నేను నిరం

తర బ్రహ్మచర్య వ్రతుఁడనయ్యును పరస్త్రీపర్యంకముల
జూచితినే? కష్టా! పాపినైతిని. పరలోకదూరుఁడనైతిని
ఏమిచేయుదు? ఈఘోరపాతక పరిహారార్థమై యేమిచేయ
వలయు? ఎందుపోవలయు? (యోచించి) ఆహా! నాకే
మాలోచన? సాక్షాత్ శ్రీరామకార్యార్థమై యీయంతః
పురముఁ జొచ్చితిఁగాక కామబుద్ధిచేఁ జూచితినా? ఇదియుఁ
గాక యిందరు కామినులఁ జూచినప్పటికిని నామానసమే
మైనఁ జలించెనా? సర్వపాపములకు మనసేకదా కారణము?
కావున పాపభయము నాకేమియులేదు. అయ్యో! ఏది
యెట్లున్ననేమి? సకల పతివ్రతావిఖ్యాతయగు మాసీతా
మాతలభించినఁగదా నాశ్రమయంతయు సఫలమగును?
(కొంచెమునిపుణముగాఁ జూచి) భళిరే! లభించె. శ్రీరా
ముదేవి లభించె. మాజానకీదేవి లభించె. నేధన్యుఁడ. నే
కృతార్థుఁడ. నేను వచ్చునప్పుడా రామచంద్రుఁడేమి గుర్తులఁ
జెప్పియుండెనో యవి యీతరుణియందుఁగనుపించుచున్నవి.
నాశ్రమయంతయుఁదీరె. (యోచించి) అకటా! శ్రీరామ
చంద్రుపట్టపుభార్యయై, సకలలోకములకు మాతయై, పరమ
సాధ్వీగుణవిఖ్యాతయై, నేత్రనిమీలనమాత్రమున లోకజాల
ములసృజించి, క్షణమాత్రమున భస్మముచేయఁజాలు శాపాను
గ్రహసామర్థ్య విరాజితయైయలరారు జానకీమాత, యీ
దుర్జాతుని, రావణుని యంతఃపురముఁ జేరునా? కాదు;
కాదు. ఈతరుణి మాతల్లికాదు. లోకమున నొకరినిఁబోలి
నవారు మఱియొకరుండరా? ఈమె సీతకాదనియే నిర్ధరింప
వలయు. అంతరావణుఁడు నిర్బంధించినఁ దనప్రాణములనైన
వాయుఁగాక మాదేవియిట్టి నీచ, ఘోర, పాతకకృత్యములకుఁ
బాల్పడునా? కల్ల. కల్ల. మఱచితి. కనుబొమలనడుమ పద్మా
కారంబగు మచ్చయుండవలయుఁగదా? పరీక్షించెద. (పోయి
చూచి) ఇప్పుడుగదా నామదినున్న సందియమంతయుఁదీరె.

ఈకాంతామణి ఫాలమున నాపుణ్యాలక్షణమేలేదు. ఈ లల నామణి(వేల నుంగరమొక్కటి యున్నది. దానినింతచూచెద (చూచి) ఔరా! ఈయంగుళీయముపై రాక్షసభాష కొన్ని యక్షరములు ముద్రింపఁబడినవి. (చదివి) ఆహా! ఇప్పుడంతయు విశదమయ్యెను. ఈతలోదరి మండోదరియా? ఈమెయేకదా రావణునిపట్టపుదేవేరి? ఏతాదృశ సౌందర్య సద్గుణ విరాజమానయగు రామామణిని నిజకాంతగాఁ బడసియు పరదారగమన పాతకమున దుర్మార్గుఁడేల యొడిఁగట్టుచున్నాఁడు? కామబాధితులైన వారికిని, మద్యపానులకును, ద్యూతకారులకును, చోరులకును, రాజులకును లభించినంతయే చాలుననెడి తృప్తి కలుగునే? (కొంచెము రావణుఁడు కదలును) అదిగో! కదలుచున్నాఁడు. ఇఁక యిందుండినఁ బ్రమాదము. పోయినాతల్లినివెదకెద.

(నిష్క్రమించును)





# విభీషణపట్టాభిషేక నాటకము

## ద్వితీయాంకము—తృతీయరంగము.

లంకాపట్టణము.

(ప్రవేశము ఆంజనేయుఁడు. పాడుచు)

(అనుబంధము 14.)

ఆంజ॥ అక్కటకటా! నాకేలయట్టిప్రాప్తి లభించును? పరమ పాతకియగు నాకేల యా త్రిలోకపావనియగు జానకీసందర్శనము లభించును? శ్రీరామునకు సంతసముఁ గలిగించు పుణ్యమెట్లుకలుగును? ఈపురంధ్రీమణి రావణునిచేఁ జిక్కి, తల్లడిల్లి, భల్లూకముచేఁ జిక్కిన చిలుక బాలికఁబోలె యట్టె మృతిఁజెందియుండునా? లేక సముద్రముపై వచ్చినప్పు డతి వేగమున జారి సముద్రమునఁబడియుండునా? కాకున్న నీలంకయందు రావణుని భార్యలచే భక్షింపఁబడియుండునా? కాదేని తనపాతివ్రత్యమును కాపాడుకొనుటకై యాత్మహింసకైన సమ్మతించి తనప్రాణములఁ బాసియుండునా? లేకున్న రామవియోగమునఁ దపియించి తపియించి, కృశించి దినదిన మింతింతగాఁ దన మనోహరాంగమును గ్రద్దలపాలుఁ జేసియుండునా? అయ్యయో! అంగదాదికపివీరుల కేమని వచియింతు? "సీతనుఁజూచితివా; క్షేమముగానున్నదా" యని శ్రీరాముఁడు నన్నతిప్రేమచేనడుగ నేనేమని ప్రత్యుత్తరమిత్తును? సుగ్రీవుఁడు "నాయానతి యేమిచేసితివ"ని వచియింపఁ దలవంచి యేమని భాషింతును? కట్టా! ఈవృత్తాంతము

విన్నతత్క్షణమున మా రామచంద్రుఁడు జీవించునా? పితృసమానుండగు నగ్రజుపాటుఁజూచి లక్ష్మణుఁడొక్క నిమిషమైనఁ బ్రాణముల భరించునా? తనప్రాణములఁ గాపాడిన మిత్రరత్నముల, నా రఘుకులరత్నములఁ బోఁగొట్టుకొని సుగ్రీవుఁడు తనయంగముల గ్రద్దలపాలు సేయకుండునా? అతనిపాటుఁ దిలకించి తారారుమాది పతివ్రతలు దేహముల భరింతురా? ఇంతయుదంతము నాలించి రామునిరాక కెదురు చూచు భరతుఁడు మనియుండునా? లేకలేకకలిగిన పుత్రుల మరణంబుఁ గన్నులారఁగాంచి కౌసల్యా సుమిత్రాది మాతలట్టె చావక బ్రతికియుందురా? ఇంతప్రళయమునుచూచి యంగదాది కపులందఱు నొక్కుమ్మడి యగ్నిఁజొచ్చెదరు గాక జీవింతురే? అయ్యో! నావలనగదా యింతయనర్థము గలుగును? నేనేలభూమిని జనించితి? మాతల్లికిగర్భస్రావమైయుండిన నింతకష్టముకలుగనేరదుకదా? అక్కటా! ఘోర పాతకినైతిని. రాఘవకులముపాలిటి మృత్యువునైతిని. కపికులమును నేలఁగలిపెడు క్రూరాత్ముఁడనైతిని. సకలలోకమారణ క్రూరమృత్యువులారా! నన్నేల చంపరారు? జడప్రాణహారణ భీకరప రేతనాయకా! నాప్రాణములనేలఁగైకొనవు? ప్రళయ కాలదహన దావాగ్నులారా! నన్నేల దహింపరు? మహోదధులారా! ఈచండాలునేల మీరుముంచిచంపరు? ఏమి చేయుదు? ఎందుపోదు? ఇదియేనిర్ధారణము. ఇందేయగ్నినిఁ గల్పించుకొని యాయగ్నిజ్వాలలోఁబడి శరీరముఁ బాసెద. అయ్యో! ఊరక ప్రాణములఁబాసిన నేమిసాధించినట్లగు? "జీవన్ భద్రాణిపశ్యతి" యని యార్యులు వచింతురుగదా? నేనుజీవించియున్న కొంతకాలమైనను రామలక్ష్మణులాశచే జీవించియుందురు. నేనెంతదురాత్ముఁడను? అయ్యో! దురాత్ముఁడను సైతము కాకపోయితినే? దురాత్ముఁడగువాఁడు బ్రతికియుండినప్పుడుమాత్రము లోకమును బాధించును.

నేను బ్రతికియుండినను మృతిఁజెందినను లోకమును బాధించుచున్నాఁడ. ఆహా! ఇన్ని సంకటములకుమూలమా పాపి రావణుఁడుగదా? వానిదశశిరములఁద్రుంచి శ్రీరామునకు కానుకగా సమర్పించెద. కాదేని నారావణు రాక్షససహితముగ నీలంకాపురినిఁ బెకలించి సముద్రమునఁ గలిపెద. లేదేని ముల్లోకముల నావాలమునకుఁజుట్టి బాధించెద. అప్పుడైనను సురలందరు మా జానకీదేవిని జూపఁగలరు. అయ్యో! నేనెంతవెకలినైతిని? లోకములబాధించిననేమి ప్రయోజనము? అందెవ్వరో వచ్చుచున్నట్లున్నది.

(ప్రవేశము; ఇరువురుస్త్రీలు పాడుచు)

(అనుబంధము 15.)

1. స్త్రీ॥ అమ్మా! ఎన్నిదినములే మనకీకష్టము?

2. స్త్రీ॥ ఎన్నిదినములు? చచ్చువఱకునింతయే.

1. స్త్రీ॥ ఆరావణుఁడు మృతిఁజెందిన మనకు సుఖముకలుగదా?

2. స్త్రీ॥ నీకేమిపిచ్చియే? రావణునిఁ జంపువారెవ్వరు?

1. స్త్రీ॥ నాకుఁజూడ నిప్పుడు సీతయనెడు యొకమనుష్య స్త్రీని దెచ్చియున్నాఁడుకదా? ఆమెయే యీలంకపాలిటి మృత్యుదేవతయని తోచుచున్నది.

2. స్త్రీ॥ నిజము. ఆమె పరమపతివ్రతామణి. పరకాంతల బాధించువాఁడు కలకాలము మనఁజాలఁడు.

ఆంజ॥ అమ్మా! మీరెవ్వరు? ఆసీతాదేవి యెవ్వరు? ఆమె యెందున్నది?

1. స్త్రీ॥ అయ్యా! మాచరిత్రమేల? మేమునిర్భాగ్యులము. రావణుఁడు మముఁబట్టియుండఁ గలకాలము దుఃఖములకు లోనైయున్నారము. నీవెవ్వరవు? ఇందేల వచ్చితివి? నీకే గ్రహచారము చాలదు?

౦జ ॥ మీరేమియు నావిషయమై యాలోచింపకుఁడు. మీ విషయము సైతము శోకింపకుఁడు. కొద్దికాలముననే రావణుని సంహరించు వీరుఁడొక్కఁడు రాఁగలఁడు. మీకు బంధవిమోచనము కలుగును. అది యట్లుండనీ. సీత యెవ్వరో చెప్పకపోతిరే?

స్త్రీ ॥ అయ్యో! కపివర్యా! ఆసీతయుమావలెనే యొకనిర్భాగ్యురాలు. ఎవ్వరో రామునిపత్నియట. కొన్ని నెలలక్రిందట రావణుఁడు కొనితెచ్చియున్నాఁడు.

౦జ ॥ ఆమెనెందుంచియున్నాఁడు?

స్త్రీ ॥ అల్లదే! అందుకనుపించు యశోకవనముననుంచియున్నాఁడు. పాపమాతన్విని విచారించువారేలేరు.

౦జ ॥ (స్వగతము) ఆహా! వీరే నాప్రాణమును గాపాడిన పుణ్యాత్ములు (ప్రకాశము) తల్లులారా! మీరిక వెడలుఁడు. నేనా దేవి కొఱకయ్యే వచ్చియున్నాఁడను. పొండు. నేనుకార్యము సాధించెద.

స్త్రీలు ॥ (నిష్క్రమము)

౦జ ॥ ఔరా! నాకుదారికలిగెను. ఇదివఱకును నేనాయశోకవనమును మాత్రము వెదకనైతిని. పోయియాదేవిని దర్శించెద. జగద్రక్షకా! శ్రీరామా! నాకార్యముఫలింపఁజేయుము. త్రిలోకజననీ! జానకీదేవీ! నీవుప్రకృతిస్వరూపిణివి. సర్వాంతరములయందు నిలిచి మదీయకార్యమును సఫలము జేయుము.

(నిష్క్రమము)

శ్రీ

# విభీషణపట్టాభిషేక నాటకము

తృతీయాంకము—ప్రథమరంగము.

అశోకవనము.

[రాక్షసీ గణముతో సీత యుండును.]

(సూక్ష్మయవనిక పడియుండ ప్రవేశము; ఆంజనేయుఁడు)

(అనుబంధము 16.)

ఆంజ॥ అదియే యశోకవనము. అక్కడ కనుపించునది యొక యశోకవృక్షము. దానిక్రింద ననేక రాక్షసీగణములు కావలియుండ వారిమధ్యమున నొకతరుణీమణి కూర్చుండి యున్నది. ఆమెయే యుండునా సీతాదేవి?

(17-వ అనుబంధములోని పల్లవి.)

ఆంజ॥ ఆమె రామనామము నుచ్చరించుచు శోకావేశమున మునిఁగియున్నది. ఐనను త్వరపడి యభిప్రాయమివ్వరాదు. సమీపించిచూచెద.

(నిష్క్రమము.)

(సూక్ష్మ యవనిక యెత్తఁబడును. రాక్షసీగణముతో సీత కూర్చొనియుండును.) (ప్ర; ఆంజనేయుఁడు దూరమున)

(అనుబంధము 17.)

సీత॥ అకటా! నాథా! ఏలయాలింపవు? నన్నేల రక్షింపరావు? నీవుదయమాలిన నాకింకెవ్వరుదిక్కు? అనాథలను రక్షించు వాఁడవు నన్నేలయుపేక్షించితివి? ఒక్కనిమిషమెడబాసిన

నెంతయో సహింపనివాఁడ వింతకాలము నన్నువిడిచి యుండుట కెట్లోర్చితివి? రామభద్రా! దయాసముద్రుఁడవగు నీవింత నిర్దయుఁడవగుట నాగ్రహచారముకదా? అకటా! తల్లిదండ్రులఁబాసినను, పురమును, రాజ్యసుఖములను విడనాడినను, నీసన్నిధాన మొక్కటియుండిన నదియేపదివేలనియు, అదియేపరమపదమనియు నెంచిగదా నీ వెంటఁ జనుదెంచితి? శ్రీరామా! ఆపాపపుమాయలేడి నాచెంతకఱుగుదెంచిన నేనేల *దానినాశించితి? ఆశించి నిన్నేలప్రార్థించితి? ప్రార్థించితిఁగాక నీకేలదానివెంటఁ జనకుండెడుబుద్ధి కలుఁగదయ్యె. కలిగెఁగాక అయ్యయో! ఊరక నిరపరాధియై నా యనుంగుపుత్రసమానుఁడై, పరమసుస్వభావుఁడైయున్న నామఱఁది లక్ష్మణునినేల వచింపరాని దుర్భాషలనాడితి?

సీ॥ బంగారులేడి నాపర్ణశాలకురాగ
యెనలేనియాశ నాకేలకలిగె।
కోరమాకోర్కెల, కోరిదానిఁగొనంగ
విభునిరామునినేల వేఁడికొంటి।
వేఁడినంతనెనాదు విభుఁడదికాదన
కేటికిదానిని వెంబడించె।
ఏగుటనేరమా యేటికినాజింక
హా! లక్ష్మణా! యనియరవఁగలిగె।

గీ॥ అరచెఁబో లక్ష్మణునటుఁ బొమ్మంటినేల?
అతఁడువలదన దుర్భాషలాడనేల?
ఇపుడురక్కసుచేఁజిక్కి యేడ్వనేల?
జగతి దుఃఖపుచావిట్లుచావనేల?

దైవమా! వినాశకాలమున నెట్టివారికెట్టిబుద్ధినైన గలిగింతువుకదా? రాఘవరామా! నీకేల యీక్రూరత్వమిపుడుకలిగె?

అయ్యో! నిన్నేలనవలయు. నాపురాకృతకర్మఫల మిట్టున్న నీకునావృత్తాంత మెట్లు తెలియవలయు? తెలిసియుండిన నయరక్షణ మూరకుందువా? కట్టా! ఆయాశనా కేల?- కెవరుదిక్కు? నాకుమరణమే శరణము. హా! రామా!

ఆంజ॥ ఈసాధ్వీమణి దుఃఖముచే నేమేమోమాటలాడుచున్న ఆయాసపవశమున మాటలు రామిచేతను, స్వరము క్రుయుంపుటచేతను నీమె యాలాపములు నాకుఁదెలిఁకున్నవి. ఆ శ్రీరామమూర్తి వచించిన లక్షణములన్నిఁ నేర్పరించుట కింతదూరమునుండి సాధ్యముకాకయున్నఁ కావున నేనాయశోకవృక్షమునెక్కి యామెలక్షణములఁ బట్టియు, యామెవాక్యములనుబట్టియు యామెయెవ్వరొ నిర్ధరించెదఁగాక.

(అనివృక్షమెక్కును.)

బిడాల॥ ఏమేసీతా! నీవిందుండి నాల్గుమాసములు కావచ్చెను చెప్పిచెప్పి మేము వేసరితిమి. ఇఁకనైననుమాంమాటలవిని మ ప్రభువును వరించెదవా లేదా? లేకున్న నిన్ను ఖండింతుము

అందఱు॥ ఖండింతుము. దండింతుము. సంహరింతుము. చెప్పుమ నీ నిర్ధారము.

సీత॥ ఇదియే నానిర్ధారము. మీరెంతచెప్పినను, మీరెంఁ బాధించినను, తుదకుచంపినను మీమాటను జరుపను. ఇఁ నాతోమాటలాడకుఁడు. మీయిష్టమువచ్చినట్లు చేయుఁడు

హా! దైవమా! నాకెట్టిపాటు కలిగించితివి? అత్త మామలనగలించితివి. పురమును బాంధవులను దూరమ చేసితివి. అవియన్నియునేమైననుమానెఁగాక నా నాథుని నా జీవనాథుని సన్నిధిఁబాపి, యీరక్కసుని పాలుచేసితివే ఇంకనైనను మానవా? ఓరామా! శ్రీరామా జగదభి రామా! రాఘవరామా! అనాథనైననన్ను బోషింపవే లోకములఁగాపాడునీకు నేనుభారమా?

సీ॥ నన్నుఁ గాంచఁగ రాడె యన్నిలోకమ్ములఁ
గాంచువాఁడు తనంతమించువాఁడు।
కని యార్తిఁ దలఁపడే కౌసల్య ముద్దులఁ
గనెడివాఁడు జగంబుఁ గనెడివాఁడు।
నామొరాలింపడే సౌమిత్రి సేవింపఁ
జెలఁగువాఁడు ముదంబుకలుఁగువాఁడు।
తనసతి బ్రోవఁడే తనుఁజేరువారల
నేలువాఁడు ననాథులపాలివాఁడు।

గీ॥ కాంతఁగావడె మానులఁగాచువాఁడు।
నెంచువాఁడు జగంబు సృజించువాఁడు।
కరుణగలవాఁడు భువి తేఁడు కలిమి తేఁడు।
నాదుమన్నీఁడు రాముండు నాకు లేఁడు॥

(లోపలధ్వని; సకలలోకవిద్రావణా! రావణా! బహుపరాక్.)

అదిగో! మరల నేల నోఱగెదవు. లెమ్ము చూడుమదే మారావణచక్రవర్తి వచ్చుచున్నాఁడు. అతనివద్ద భయభక్తులతో నడుచుకొమ్ము. చెప్పలేదనెదవు. ఇందుకు తప్పితివా నీవుదక్కవుసుమా. ఇదిగో మేమందఱము మారాక్షసరాజు నెదుర్కొన బోవలయు. ఈవనము వాకిట మంగళనీరాజనము లిచ్చి పిలుచుకొనివచ్చుటకై వెళ్ళుచున్నారము. భద్రము.

(రాక్షసస్త్రీలు నిష్క్రమము.)

అకటా! రావణుఁడు! రావణుఁడు! మరల వచ్చెనా? హా! జనకా! లక్ష్మణా! రామా!

సీ॥ ఇదిగదా వేళ దీనదశావిదుఃఖిత
ప్రవిమలసాధ్వీ సురక్షణమునకు।
ఇదిగదా కాలము హీనరాక్షసబృంద
పరిభూత కామినీపాలనమునకు।

ఇదిగదాసమయము అకనదుర్జయదుష్ట
మారణ లోకోపకారమునకు ।
ఇదిగదాయదను సంస్కృతరావణసురోత్కట
దశకంధర ఖండనమునకు ।

గీ॥ హా! దయాధామ, రామ, లోకాభిరామ ।
అరిబలవిరామ, సూర్యవంశాబ్ధిసోమ ।
శిష్టమునిప్రేమ, మామకచిత్తకామ ।
రఘుకులోద్ధామ మఖిలధామ, రామరామ ॥

ఇఁక నాజీవితము నిలువదు. ఈజన్మమున నినుఁజూచ భాగ్యము నాకుఁగలదో లేదో యెఱుఁగఁజాల. అలకప్రాః తమై, అమరేంద్రావనమై, అమితదయారసమైన నీముఖమః నొకతూరి నాకుఁ జూపుము. అయ్యో! ఇట్టి నిర్భాగ్యః రాలి కట్టిభాగ్యమేలకలుగు?

(అనుబంధము 18.)

(ప్రవేశము; ఒకరితర్వాతనొకరు రాక్షసభటులు కరదీపిక సహస్రముతో.)

1\. భట॥ శ్రీకైలాసపర్వత లీలాకందుక బాహువింశతిప్రవీణా రావణా! బహుపరాక్.

2\. భట॥ ఆఖండల మదఖండన దోర్దండ ప్రతాపసాంద్రా బహుపరాక్.

3\. భట॥ సప్తసముద్రపరివేష్టిత చతుర్దశభువనవిద్రావణా! రావణా! బహుపరాక్.

4\. భట॥ మార్తాండమండల ప్రభాభాసమాన జగద్విధాయకా నిజపుష్పకసంచలద్విమానాయకా! దానవనాయకా! బహుపరాక్.

5\. భట॥ ఐరావతనిరోధ ఉరోభాగ సంకాసిత నిజలక్షణభాసురా దాసీకృతగీర్వాణ గర్వనిర్వాపణప్రవీణా! రాక్షసేశ్వరా బహుపరాక్.

భట ॥ సరసిజాసన పరిభాసుర లంకాశాసనస్ఫూర్తీ! బందీకృత సేవానంద లోకనివర్తీ! సర్వవేదాంత సుజ్ఞానవర్తీ! ప్రసిద్ధ కీర్తీ! శ్రీరావణచక్రవర్తీ! బహుపరాక్.

(ప్రవేశము : రావణుఁడు)

వణ ॥ (భటులకు పొమ్మని సైగచేసి)

జానకీ! ఏలనన్నుఁజూచి సిగ్గుపడెదవు? వెలికిచనుదెంచి కాంచినవాని ధన్యుఁజేయఁదలంచు నీరమణీయాంగకముల నేలవస్త్రనిరోధనమున మరుగుపరచెదవు? అవియేమపరాధ మొనర్చె? ఇప్పటినుండియే వాటికిసైతము నీయట్టినిష్కరుణయే నేర్పెదవా? సీతా! నినుగాంచినవాఁడే లోకమున కృతార్థుఁడు. ధన్యుఁడు. భవదపాంగావలోకన భాగ్యము నొందుటకై నేనొక్కఁడేయేల హరబ్రహ్మాదులు సైతమెంత యోతపముఁజేయుచుందురు. తిలకించినవాని కద్భుతచంద్ర లోకముదమునించు నీ దరహాసచంద్రికలనేల నాపై నొలయింపవు? రమణీయ కైవల్యాస్పదమొక్క క్షణమాత్రమున నేలఁజాలు నీయంగకంబులనేల వృథా కృశింపఁజేసెదవు? నీ యభినవ లావణ్యవిరాజిత దివ్యశరీరంబును సేవించుటకై యెంతయో వేకరుచున్న పట్టుపీతాంబరముల నేల ననాదర మొనర్చెదవు? అవియు నేనొర్చిన యపరాధమేమైన నొనర్చెనా? భామరో! అజస్రము నీదివ్యమగుమూర్తిని ధ్యానించుచు సంతోషవారాసి మునిఁగియున్న నన్నేల యరగంటఁ జూచెదవు? ఏదీ ఒక్క మాటైననాడుమా?

(అనుబంధము 19.)

(ఒకతృణము చేతనుంచుకొని) పాపాత్మా! అనాథయువతుల నేలభాధించెదవు? ఇంతవఱకునిట్టి కలుషోక్తులాడుచున్న నీనాలుకయేల వ్రీలకున్నది? పతివ్రతామణుల బాధించిన వారియుసురు నీకు తాకకపోదుసుమా. ఈజానకి నీచేఁజిక్క

నదని యెంచకుము. శరీరముమాత్రము నీనిర్బంధమున నున్నదిగాని నా మానసము నీ నిర్బంధమున కెన్నటికిని చిక్కనేరదు. పొమ్మూరక ప్రేలకుము. పరదారలబాధించెడు వారల లక్ష్మితొలఁగిపోవును. అన్నా! నీకు బుద్ధిచెప్పెదను. చెడకుము. ఊరకపొమ్ము.

రావణ॥ రాముఁడు; గీముఁడు. వాఁడనఁగ నెంతటివాఁడు. అడవియందు బిక్కికాయలుతిని మృగముఁబోలెతిరుగాడునొక్క మానవునినా నాయెదుట కొనియాడెదవు? నీబుద్ధి యెంత నుతించిననుతీరదు. చెప్పెంతునా ఆరాముని నిటకు? పరీక్షించిన నీకే తెలియఁగలదు.

ఆంజ॥ (స్వగతము) నీవేల పరీక్షింపవలయు? కావలసిన వాలినడుగు పొమ్ము.

సీత॥ ఛీ! రాక్షసాధమా! నీవు గర్వమున కన్నుమిన్నెఱుంగక ప్రేలెదవుగాక వేరుకాదు. ఆ త్రిలోకాభిరాముని యెదుట నీవు నిలువనైననిలిచెదవా? నీజ్ఞాతులైన ఖరదూషణాదులు సైతము నీవలెగర్వించియా రామభద్రునితోఁబోరి యేమైరో నీకుఁదెలియదా? అంతయేల? నీమామమారీచునిగతియెఱుఁగుదువుగదా? ఊరకచెడకుము. నన్ను రాముని కర్పింపుము.

రావణ॥ కలికీ! ఎందో చేతగానిముదుసలులై, కాటికికాలుసాచియున్న బడుగురక్కసుల చక్కాడినంతనే రాముఁడొక మగధీరుఁడనుకొంటివా? ఇఁక మారీచుఁడో మిక్కిలి మాయావియేకాని యన్యముకాదు. మేమందఱము వానిని చేతకానిపందయని యెందోయొకమూల త్రోసియుంటిమి. అట్టిపిచ్చుకపై బ్రహ్మాస్త్రము ప్రయోగించినమాత్రముననే మీ రాముఁడొక్క వీరుఁడట! నీవువానిని నుతింతువఁట! ఏదీ! అంతబలశాలియైన దనయాలిని నేనుకొనితెచ్చియున్నను తలపై ముసుగువేసికొని యూరకచచ్చినట్లుపడియున్నాఁడే?

కడిదివిలుకాఁడైన నట్లూరకుండునా? నీకేలసందేహము? ఆరాముఁడు చేపనై సముద్రమునదాగినను, కొండక్రిందదాచుకొన్నను, పందియై భూమిని త్రవ్వినను, మనుష్యుఁడై, సింగమై యడవిచేరినను, బాపఁడై బిక్షమెత్తఁబోయినను, వానిని విడువను. ఆచింతమానుము. నీసన్నిధాన దివ్యసుఖమిచ్చి కాపాడుము.

ఆంజ॥ (స్వగతము) కొంచెముతాళుము; నీకాదివ్యసుఖమే కలిగించెదను.

సీత॥ ఓరీ! ఊరకనోరున్నదని వదరిన ప్రయోజనమేమి?

ఆంజ॥ (స్వగతము) ఒకటికాదు. పదినోళ్ళు.

సీత॥ నీవా రాముని సన్నిధానమున నన్నుఁదెచ్చితివా? అట్లు తెచ్చియుండిన నీపదిశిరంబులు గ్రద్దలపాలుకాకయుండునా? తులువా! నీకొకమాటచెప్పెదను. నీవుకావు సర్వలోకములునుపై వచ్చినను మారామచంద్రునిచెంత చేరఁజాలవు. రామునితో ద్వేషినై యకాలమరణముఁ దెచ్చుకొనకుము. భీకర హర్యక్షపాలితమగు హరిణామిషము నొక్కశునకము గ్రహించి దక్కఁగలదే? ఆ ఫాలాక్షుని బారినుండి తప్పించుకొందువుగాక రామునిచేఁజిక్కి పోవఁజాలవు. రామునకు నన్నప్పగించి ప్రాణములరక్షించుకొనుము.

సీ॥ ప్రళయాగ్నివలెమండు రాముకోపపుదృష్టి
నిన్నుఁజొచ్చి దహించిచనకమునుపె।
పిడుగుఁబోలిన బాణవెల్లువల్ దరికొని
నినుఁజించి చెండాడిచనకమునుపె।
ధరణిపై నీతలల్ దొరలాడ కాకముల్
చక్కాడితన్నుచు చనకమునుపె।
నీలంక నెల్లెడ నిండిరాక్షసరక్త
శోణప్రవాహముల్ చొరకమునుపె।

గీ॥ బాహువింశతి ధర్మపైన బడకమునుపె।
విధవయిల్లాండ్రరోదనల్ వినకమునుపె।
పుడమిరాక్షసకులమెల్ల చెడకమునుపె।
పోయి రామునిశరణంబుఁ బొందుమసుర॥

రావణ॥ అలివేణీ! నీ యింపుసొంపారు నధరంబు కోపంబుచే సంచలించు కాంతికిని, నీసంతాపమున నించుకవణకుమించు తీవియఁబోలు నీయంగవల్లికిని, యించుక యెఱ్ఱబారి కెందామరలగేరు నీనేత్రరాజీవములకును నామానసము నీవశమైనందున సంతసించెదగాక కోపగింపను. చంచరీకేక్షణా! నీకెంతపిచ్చితనము? మందారాది కల్పవృక్షములయందును, సముద్రసమీపోద్యానములయందును, నిరంతరక్రీడల ననుభవింపుము. నీకు బృందారక సుందరీమణులు చరణసేవకులైయుందురు. ఈ లంకారాజ్యమునంతయు నీస్వాధీనమొనర్చెద. నన్నుమాత్రము కరుణింపుమా.

(అనుబంధము 20)

సీత॥ ఛీ! దురాత్మా! వాగకుము. నీకు మరణకాలమాసన్నమైనది. వినాశకాలమున నీకే విపరీతబుద్ధిపుట్టినది. మరల చెప్పెదను. నేడో రేపో రామబాణములు నీప్రాణముల గ్రోలఁ జనుదెంచుచున్నవి. వానికి నీజీవిత మప్పగింపకుము. నీవు చెడునదేగాక లంకారాజ్యమును చెరపకుము. రామచంద్రుని శరణొందుము.

రావణ॥ (కోపముతో) ఏమోయని పోవనిచ్చినట్లంతయు మీరి మీరిపలుకుచువచ్చెదవా? ఎవ్వఁడా రాముఁడు? రాముఁడఁట! నన్నుఁట! చంపునఁట! ఎందో మాకబంధునిచేతనో విరాధునిచేతనో చచ్చి నిర్నామమైనవాఁ డెందుండిరాఁగలఁడు? నీకేల భ్రాంతి? నీకుగడవిచ్చి నాలుగుమాసములు కావచ్చెను. మెత్తవడకున్నావు. ఈరావణచక్రవర్తి కరుణావలోకమొందుటకై యా దేవవలంతిచేడియలెంతయో

తపంబొనర్చి వేకరుచుందురు. అట్టివాఁడు తనంతనే నీయ పాంగవీక్షణములకై ప్రార్థించినను సమ్మతింపకున్నదానవు. అయ్యో! సీతా! నీపిచ్చి కేమనవలయు? సిరి తనంతట తానే యింటికిరా వలదని మోకాలొడ్డుచున్నావే? నిన్నే మనువాఁడ? అరచేతినైకుంఠపదవిని విసరి పారనైచెదవే? నాయంతటివానిని ప్రేమపుచుట్టముగాఁ బడసిన నీతండ్రి పురందరాదులకైన మాననీయుఁడుకాఁడా? నీబాంధవులందఱు కృతార్థులుకారా? నీవేయాలోచింపుము.

సీత ॥ రాక్షసాధమా! నీకు మంచిమాటపనికివచ్చునే? ఆ సర్వలోకశరణ్యుని శరణంబునొందుటతప్ప నీకు వేరుదిక్కు కలదే? అతఁడు దయాళువు. “నేనపరాధి; నన్నతఁడు క్షమించునా” యని యోచింపకుము. శరణొందినవారి నతఁడు కన్నపుత్రులకంటె నెక్కుడుగాఁ జూచువాఁడు.

ఓరీ! నీవొకవీరుఁడనని మాటలాడెదవా? రాముఁడు లేనియెడ నన్నపహరించిన దొంగవు. పతివ్రతల బాధించెడి పందవు. ఇతరులవంచించెడి మోసగాఁడవు. ఛీ! నీజన్మమేల? నీనాలుకయేల పుచ్చిపోవదు. నీవు బ్రహ్మవంశమునజనించిన బ్రాహ్మణుఁడవా; క్రూరహింసాకార్యములఁ జేయుఁచండాలుఁడవగుదువుగాక? ద్రోహీ! నీవెక్కడ? రాముఁడెక్కడ? దీనరక్షకుఁడా రామచంద్రుఁడు. దీనభక్షకుఁడవీవు. గోబ్రాహ్మణపాలకుఁడా రాముఁడు. గోబ్రాహ్మణ బాధకుఁడవీవు. జగత్పాలకుఁడా రాముఁడు. జగద్బాధకుఁడవీవు. ఓరీ! మిూరిమిూరిపలికెదవా? నీయాంధ్రువిధవలగువఱకు నామానసమునకూరటకలుగదు సుమా! నీవెన్నఁడో చచ్చిన కలుషుఁడవుకావున నిన్నేల నాశాపానలమున జంపవలయునని యూరకుంటిని. లేకున్న నిన్నరనిమిషమున కాల్చి, నీమాంసమును కాకములకువేయఁజాలనా? ఛీ! సిగ్గులేక మోమేల చూపెదవు? పాపాత్మా! తొలఁగు మిక్కడనుండి.

(అనుబంధము 21).

రావణ ॥ ఓసీ! కలుషాత్మురాలా! మూయుము నీనోరు. నిన్నిప్పుడే కరవాలమున ఖండించినను పాపముకలుగదు.

(అనుబంధము 22).

చం॥ పటుతర దేవదైత్య పరిపంథినినై పరలోకనేతనై।
చటులపరాక్రమాంచిత విచారుఁడనౌ ననురావణేశ్వరుర్।
కుటిలతనింతయైన సరకుంగొన వేటికి నీచపాపినీ।.
యిటు నినుఖండఖండలుగ నేచెద నొంచెదచించిచెండెదర్॥

ఆంజ ॥ (స్వగతము) ఆహా! దురాత్మా! నిన్నిప్పుడే రూపుమాపెద. ఇంక సహింపఁజాల. అయ్యో! శ్రీరామచంద్రునానతి లేనిది యేమియుచేయఁజాలనుగదా? కానిమ్ము.

రావణ ॥ రాక్షసీ గణములారా.

[ప్రవేశము ; రాక్షసస్త్రీలు]

ఇదే నాయాజ్ఞ. ఇఁక రెండుమాసములవఱకు దీనికి చాలినంత బోధింపుఁడు. అప్పటికిని యీనీచాత్మురాలిమానసము మెత్తవడకుండెనా నాయానతిలేకయే దీనినిజంపి దీనిమాంసమును యథేచ్ఛముగ భుజించి, భూమిపై నృత్యమాడుఁడు. హెచ్చరిక.

(నిష్క్రమము)

ఆజా ॥ సీతా! వింటివికదా రావణచక్రవర్తిమాటలు? ఇంకనైనను పొగరుమాని మారావణేశ్వరుని పతిగాఁ గోరుము. కాలము త్వరలోవచ్చును. రెండు నెలలు నీకుగడవు.

వక్ర ॥ ఇఁక నీమాటలు సాగిరావు. నిన్నుహింసించిన మారాజేమనునోయనియూరకుంటిమి. మామాటవింటివా సరి. లేకున్న నీమాంసముసుకోసి, మద్యముసందద్దుకొని మేమందఱము కడుపార భుజించెదము.

సీత॥ అకటా! కావలసినప్పుడు మృత్యువు సైతము రాదు గదా? ఒక త్రాడైనను నాకు దొరకదే? విషమిచ్చు పుణ్యాత్ములెవ్వరును లేరగదే? కైకేయీదేవీ! ఇప్పటికైన నీమానసము చల్లనాయెనా? లక్ష్మణా! నీమనస్సుద్ది నరయక నిన్నాడిన దుర్భాషలకై ఫలము ననుభవించుచున్నాను. శ్రీరామా! నిన్నుస్వప్నమందైనను గాంచెదనన్న స్వప్నము సైతము నాకు శత్రువయ్యెనే? ఓ రాఘవరామా! ఆపర్ణశాలయందు నిన్నుఁ గాంచిన దే కడచూపాయెఁగా? కౌసల్యాదేవీ! ఇఁక నీకోడలిని, జానకినిమఱచిపొమ్ము. దశరథునికోడలనై, శ్రీరాముని భార్యనైన నాకింతటిదుఃఖము రాఁజెల్లునే? నేనింకేల మనియుండవలయు? రామచంద్రా! నిన్నే ధ్యానించుచు, నీసీత మరణమునొందు కాలమువచ్చినది. మరణకాలమునందైనను నిన్నుఁజూచుభాగ్యము లేదయ్యెఁగా? జన్మజన్మాంతరమందును నీవే పతిగానుండునట్లు చేయుము. హా! రామా! శ్రీరామా! పట్టాభిరామా! రమ్ము. రమ్ము.

(మూర్ఛపోవును).

త్రిజట॥ రాక్షసులారా! ఈదేవిని బాధింపకుఁడు. బహుకాలము నుండి నిరశనవ్రతముతో తనపతినే ధ్యానించుచున్నందునను, అతిశయ దుఃఖావేశమువలనను, ఈ సాధ్వి కడు సొమ్మసిల్లి మూర్ఛిల్లియున్నది. కొంచెమవకాశ మిచ్చిన మేల్కొనఁగలదు. మనకును రాత్రి చాలగతించెను. అల్లదే శుక్రోదయమగుచున్నది. పోయి నిద్రింతమురండు.

(అందఱును నిద్రింతురు).

ఆంజ॥ (చెట్టుపైనుండిదుమికి).

మ॥ భళిరే! కంటినికంటి సర్వభువనవ్యాకల్ప సంరక్షణా।
ప్రళయాంచ న్నయనాంబుజాత సుగుణప్రఖ్యాత శ్రీరామపా।
ద లతాంతానయసేవపూత విలసత్సంజాత సాధ్వీజనా।
కలితోత్తంసిత సీతమాతను లసత్కాంతాపరిద్యోతనే ॥

భళిరే. కంటిని కంటిని. మా జానకీదేవిని గంటిని. నేను పడినశ్రమలకంతటికిని ఫలముఁగంటిని. మా రామప్రాణ ధనము కంటిని. నా తపఃఫలరాశిని గంటిని. ఔరా! ఈజానకి యెట్లు రాజిల్లుచున్నది? ఈ రేడులోకముల కటాక్షమాత్ర మున నేలఁజాలు నీపతివ్రతాతిలకము, అనవరత రామ ధ్యానమున కృశించియు, తనస్వభావతేజమున నెంతయు నొప్పక నొప్పి యున్నది. సుందరీమణులు సేవింప, హంస తూలికా తల్పంబులవెలరారు నీలోకమాత యిప్పుడీ ధూళీ ధూసరమగు కటిక ఱానేల పరుండియున్నదికదా? రాజ్య సింహాసనమున శ్వేతఛత్రములనీడ విలసిల్లు నీలోకజనని యిప్పుడీ యశోకవృక్షములనీడ వసింపవలసెఁగా?

సీ॥ శ్వేతఛత్రమునీడ విలసిల్లునీదేవి
చెట్టునీడను తాను చేరెనేఁడు।
సిరిరాజ్యపట్టాభిషిక్తయౌ నీతల్లి
అశ్రుజలాసిక్త యయ్యెనేఁడు।
దాసీజనులుకొల్వ తనరారునీమాత
రక్కసుఁగొలువంగఁ జిక్కెనేఁడు।
కనుసన్నలోకముల్ కాపాడునీసాధ్వి
ఒక్కరావణునాజ్ఞ నొప్పెనేఁడు।
గీ॥ అకట లోకైకమాతయై యలరుజనని।
చెనటి యిడుమలనొందఁగఁ జేసెనన్న।
చేరి విధిబల మెంతటివారికైన।
నవనిబాధించునను టొక్కయబ్బురంబె॥

ఆహా! సర్వలోక ప్రభుఁడగు శ్రీరామునంతటిపతి తనకుఁ గలిగియుండియు, నీసాధ్వీమణి, దివాంధకామినుల నడుమ చిక్కిన చిలుకముత్తైదువఁబోలె, శార్దూలకామినుల నడుమ చిక్కి దిక్కులేక దిక్కులుచూచు హరిణకుటుంబినిబోలె,

కిరాతకమధ్యమునఁ జిక్కిన బాల మయూరబాలికఁబోలె, దివ్య దావాగ్నిమధ్యమునఁజిక్కి వేలారు హంసయిల్లాలుఁ బోలె నున్నదికదా?

ఓ త్రిలోకమాతా! వేదాంతపరిపూతా! సకలసద్గుణ సంఘాతా! సీతా! ఈరాక్షసీగణములే నీకూర్మిచెలికత్తెలా? ఈవృక్షచ్ఛాయయే నీవునివసించు బంగరుమేడయా? ఈ రక్కసుల పెడబొబ్బలే వీణాగానమా?

సీ॥ కనినయంతనె భీతికలిగించు రక్కసుల్
నీకూర్మిసఖులె యోలోకజనని।
డాయ శోకమునించు నీయశోకమునీడ
ఘనరాజసౌధమే జనకపుత్రి।
శ్రవణకర్కశములీ రాక్షసగర్జనల్
వీణానినాదమే వీరపత్ని।
తలపంగరాని యీ గోలుగుత్తానేల నీ
వరహంసపాన్పయో పరమసాధ్వి।

గీ॥ అకట దైవంబునేమందునమ్మ నేఁడు।
మహితగుణజాత లోకైకమాతశీత।
సతతపరిపూత వేదాంతసౌధవ్రాత।
కలుషసంపాత విఖ్యాత సీతమాత॥

అకటా! పగటివేళనుండెడి చంద్రరేఖఁబోలె, పంక మందు తనకాంతివీడిన కమలతీవియఁబోలె, పాడ్యమియందు పఠించినవాని విద్యఁబోలె, మహాలోభిచెంతనుండెడి భాగ్య సంపదఁబోలె, చంద్రవిహీనమైన రాత్రిఁబోలె నీపురంధ్రీమ ణినిబాసి రాముఁడెంతయో పరితపించుచుండుట యెంత యుఁ దగియున్నది. ఆరామభద్రునకీ సతీతిలకమే తగును. ఈసతీతిలకమున కారామచంద్రుఁడే తగును. దమయంతీ నైషధులఁబోలె, రోహిణీచంద్రులఁబోలె నీదంపతులొక

చోటనుండఁగఁజూచి సుగ్రీవుఁడును, సకలకపులును నెన్నఁ
కృతార్థులయ్యెదరో తెలియదు. ఆహా! ఈదేవిసందర్శనవ
నాకుఁగలిగినందుకు పూర్వజన్మమున నెంతతపముఁజేసితినో
అదియుండని. నేనిప్పుడే పోయి యీమెతో నేన
శ్రీరాము దూతనని చెప్పుదునా? లేకున్న నీజనని
రామునియొద్దకుఁ గొనిపోవుదునా?

సీ॥ చెప్పుదునా నేను శ్రీరామబంటంచు
నన్నెట్లు నీదేవి నమ్మఁగలదో।
కొనిపోదునా జానకిని రాముచెంతకు
నీదేవి యేమని యెంచఁగలదో।
రావణుఁగొనిపోయి రామునకిత్తునా
సాహసమేరీతి చనఁగఁగలదో।
ఇందుతో ద్దెత్తునా యినకులేశునిని ద్దె
యేయనర్థంబులు నెసగఁగలవో।
గీ॥ ఏమిచేయుదుమన్నను యెఱుకపడదు।
వేగరించిన కార్యంబు విఫలమగునో।
యిఁక నిదానింప కార్యంబు వికటమౌనో।
తెలియఁజేయవె శ్రీరామ దివ్యధామ॥

ఈజానకి కడుసొమ్మసిలి మూర్ఛిల్లియున్నది. నేనుపోయి
శ్రీరామకథామృతమీమెకు నుద్బోధించెద.

(సీతాదేవి యొద్దకుఁబోయి)

శ్లో॥ శ్రీ సూర్యాన్వయ దివ్యకౌస్తుభమణిః భక్తౌఘచింతామణిః।
కౌసల్యావరగర్భ మౌక్తికమణిః సాకేతభూషామణిః।
శ్రీ సీతాహృదయాబ్జ భాస్కరమణిః సుగ్రీవలీలామణిః।
పాయాత్కౌశికయాగరక్షణమణిః శ్రీరామచూడామణిః॥

సీత॥ (దిగ్గునలేచి) అయ్యో! విన్నదిమఱియువినవలయు. ఇన్ని
దినములకు నావీనులకువిందుగ శ్రీరామనామామృతమును
వినఁగల్గితిఁగా? ఎవ్వరుందురు? (నలుదిక్కులఁజూచి యాంజ





నేయునిజూచి) అకటా! స్వప్నమందు క[illegible]తిని [illegible]చితినే? ఏమియశుభము రానున్నదో కదా? అయ్యయ్యో! లోకమున లేనియశుభములమునిఁగియున్న నాకింకేమియశుభము రాఁగలదు? జగద్రక్షకా! పరమాత్మా! నా శ్రీరామలక్ష్మణులకును, భరతశత్రుఘ్నులకును సర్వశుభంబులనొసఁగి పాలింపుమా. ఆహా! ఏమి నా వామనేత్ర మదరుచున్నది! శుభము వేళగదా యెడమకన్నదురునందురు? అయ్యో! నాకెక్కడి శుభము?

ంజ ॥ (నమస్కరించి) అమ్మా! రామలక్ష్మణులు సుఖముగా నున్నారు. నీనాథుఁడగు రామచంద్రునిబంటును నేను. ఆంజనేయుఁడను వాఁడను. దేవీ! నీకై యా రామభద్రుఁడు సుగ్రీవుఁడను వానరరాజుతో చెలిమివాటించి, నీక్షేమ వార్తఁదెలిసికొమ్మని నన్నుఁ బంపియున్నాఁడు. నీవా జనకపుత్రి సీతాదేవియే యగుదువు. నిన్నుఁ గాంచుటచే నాశ్రమయంతయుఁదీరె.

త ॥ అయ్యా! నీవెవ్వరో తెలియదు; కాని నీమాటలు మాత్రము నాకమృతధారలై మానందమునిచ్చుచున్నవి. అయినను నిన్ను నిక్కముగా వానరుఁడని నమ్మఁజాలను.

అకటా! నన్ను జనస్థానమునుండి బలవంతముగాఁ గొని తెచ్చిన యా రావణుఁడే నీవై యుందువు. అన్నా! విధవిధముల నిన్ను వేఁడికొందును. నోరెఱుఁగని యనాథయగు నన్ను బాధింపకుము. దాసివలన నీకేమి పురుషార్థము లభించును?

ఉ॥ వేఁడెద నన్ను నిన్ను వెతఁబెట్టకుమన్న యార్తలో।
చూడ పతివ్రతామణుల స్రుక్కఁగఁజేయుట పాపమన్నమా।
వాఁడవొ రావణుండవొ విభావన సేయఁగఁ జాలనన్న నీ।
కీడగు వేసముల్ వడిధరింపకుమన్న రావణా ॥

వానరరూపమునవచ్చి నన్ను మోసగించెదవా? ఇట్టి మోసములు ధీరపతివ్రతా పరాయణమానసయగు నీజ్ఞా కని వంచింపఁజాలవుసుమా!

ఆంజ ॥ అమ్మరో! నీమాటలకు నామానసమెంతయో పరిత పించుచున్నది. నేను రావణుఁడనుకాను. నిక్కముగా కాను. చిరకాలమునుండి యాదురాత్ముఁడు కలిగించిన కడ గండ్లకై కలవరించుచున్నదానవగుటచే నన్నును నారావ ణుఁడుగా భావించుచున్నావు. అమ్మా! నేను నీతనయుఁ డను; శ్రీరామరామాభిరామమానసుఁడను. దూతనై నేమమఅయవచ్చినాఁడను. దేవీ! నన్ను విశ్వసింపుము. సందేహమువలదు. నేను కేసరక్షేత్రమున వాయుప్రసాద మున అంజనాదేవియందు జనించినవాఁడను. ఇఁక! నీనాథుని సందేశమాకర్ణింపుము.

సీత ॥ అన్నా! నీవాక్యములు విశ్వసనీయములైననుకాని అంత కంటె యెక్కువయగు గౌరవము నీయందునాకుఁ గలుగు చున్నది. అదేదియన, నేయక్షరములు వేదాంతవీధికా సంచరణములై, అవాఙ్మానసగోచరములై వెలరారునో, ఏయక్షరములు వగనైనను పగనైనను స్మరించినవారి సకల కలుష జలధరములకు వాయుసమానములై యుండునో, యే రెండక్షరములు మానీశ్వరహృదయ పంకేరుహమధ్య సిం హాసనాసీనములై యొప్పెడినో, యేయక్షరములు సాధుజనసం రక్షణములై, శిష్టసంతోషములై దుష్టరాక్షసశోషణములై రాజిల్లునో, అట్టి రా మ యనెడి పూజ్యాక్షరములు నీనోటి నుండివెలువడుచున్నవి. కావున నీవెవ్వఁడవైననేమి? రావణుఁ డవైననేమి? నాతనయుఁడనియే భావించెద. ఏదీ! నిరంతర ధ్యానమానమానస మోక్షదానప్రవీణమై, పరమపవిత్ర గుణాలవాలమై, భవబంధమోచనమై, నారదాదియోగివర జగద్గీయమానమగు రామచారిత్రసుధారసంబును వెదచ

ల్లుమా; నాతాపమంతయుఁ గడఁజనగలదు. నీవు నిక్కంపు రామబంటువేనైన రాముఁడెట్టివాఁడు? ఏయాకారముఁ గలవాఁడు? అతనితమ్ముఁడు లక్ష్మణుని లక్షణములెవ్వి? అన్నియు సక్రమముగా వచింపుము. అప్పుడు సందియము లేక నీతో మాటలాడెదను.

జ॥ లోకజనయిత్రీ! అయిన వినుము. నీలనీరద శ్యాముఁడై, పరరూపకాముఁడై, షడున్నతతనుఁడై, త్రివిక్రముఁడై, త్రిసాంద్రుఁడై, ఆజానుబాహుఁడై, అబ్జనయనుఁడై, త్రిప్రతాపుఁడై, నవశుక్లుండై, ఆకర్ణాంతనయనుఁడై భాసించువాఁడు, భక్తులపాలిటి చింతామణియగువాఁడు శ్రీరాముఁడు.

ఉ॥ నల్లనివాఁడు, నవ్వువదనంబులవాఁడు, సరోజపాళితో ।
నుల్లసడునేత్రములనొప్పెడివాఁడు, సురమ్యమచ్ఛసాం ।
పిల్లెడువాఁడు, శాంతమును పెంచెడువాఁడు, దయారసంబుచేఁ ।
జల్లనివాఁడు, శౌర్యమునుఁ జల్లెడివాఁడు దురంతపాపులఁ ।
నొల్లనివాఁడు రాముఁడు, మనోల్లసరాముఁడు వింటె యమ్మరో॥

ఇఁక లక్ష్మణుఁడో అట్టిగుణములే కలవాఁడు. వక్షమునందు భేధముఁగలవాఁడు. తనవిశాలనేత్రముల ప్రభుత్వలక్ష్మిని జాటువాఁడు. కుడిభాగమున సమంచిత లక్షణములచే సకల భూభారవహనగుణమును సూచించువాఁడు. శ్రీరామునకు కొంచెమించుమించుగా సరిపోవువాఁడు. అన్నయందు మిక్కిలి భక్తిగలవాఁడు. ఆపురుషోత్తములిరువురును నినుఁ గాంచక యరణ్యమునఁ దిరుగుచు తిరుగుచు రా నేను సుగ్రీవునితో వారికిస్నేహముఁగలిగించితిని. సుగ్రీవుని శత్రువును అన్నయునగువాలినిఁజంపి, రాముఁడు సుగ్రీవునికి కిష్కింధా రాజ్యమిచ్చెను. సుగ్రీవుఁడు తనభటులగు మమ్ముఁబంపఁగా నేను సముద్రమును దాటి, లంకిణిఁజంపి, నిన్నుఁగాంచితిని. నేను రాముని ముఖ్యసేవకుఁడను. ఆవాలియెవ్వఁడనెదవు? ఈ క్రూరుఁడగు రావణునిఁ దన తోకకుఁజుట్టి నాలుగు

సముద్రములయందు ముంచినవాఁడు. తల్లిరో! ఇఁక నీశోకమును మానుము. ఇంతకును ననునమ్మనైతివేని, ఇదే రామముద్రాంగుళీయము. కొనుము. అప్పుడైనను నన్ను నమ్మఁగలవు.

(అనుబంధము 23) (ఉంగరమిచ్చును).

సీత ॥ భళిరే నాభాగ్యము. ఈయుంగరమును దర్శించుటచే నాశ్రీరాముని దర్శించినంతటి సౌఖ్యములభించె. పరమ భక్త శ్రేసరులశిరంబున్నై, వేదాంతకామినీ కబరీభరంబున్న, శరణాగతజన భుజభరంబున్నై, భార్గవరాము కోదండమున్న, శ్రీదశరథరాజేంద్రుని పాదారవిందములన్నై, ఖరదూషణాది రాక్షస ప్రాణానిలమున్నై, పట్టాభిషిక్తసుగ్రీవ కిరీటరాజంబున్న వెలరారు నీనవరత్నాంచిత కమనీయము, శరణాగత రక్షక రమణీయము, ఈయంగుళీయము నాకింతకాలము నకులభించెఁగా? ఓయంగుళీయమా! నీ నిరుపమాన ప్రకాశమున నెల్లరవెలిగింపుదానవయ్యు నామానసము నింత వఱకు నేలవెలిగింపనైతివి? నీసన్నిధానమున చిక్కుచీకటుల పారఁదోలుదాన విప్పుడేల నాశోకాంధకారమును మాన్ప నైతివి? ఆ తెలిసె. శ్రీరామునికరమున నుండుదానవుగాన నతనికిఁగల నిద్దయాబుద్ధనే నీవును నేర్చుకొంటివికాఁబోలు? నమ్మినభక్తులకు కన్నకష్టములీను నారామచంద్రునకు నీవైన బోధింపకపోయితివా? ఉంగరమా! నీరంగారుమహిమచే నాభరతుని యంతరంగము నుప్పొంగఁజేయలేదా?॥ నీసువర్ణ భావముచే నగస్త్యాదిపరమమునీంద్రుల మానసమును రం జింపఁజేయలేదా? నన్నేల యింతకాలము పేక్షించితివి? ఓముద్దుటుంగరమా! రామునివ్రేలినుండిబాసి యొక్కకణ మైనఁగాలేదే? ఇంతచలించుచున్న దానవే? నేనింతకాలము రామవియోగమునెట్లుతాళియుంటినో నీవేయూహింపుము.

ఇఁకనైననన్ను ప్రకాశింపఁజేయుము. నీనిర్మలభావమును నాకిమ్ము. నీరాముని యొద్ద నన్నుఁ జేర్పుము.

(కన్నులకొత్తుకొను)

సీ॥ శరణుఁజొచ్చినవారి శిరముపై వెలుగొంది
వారలచింతల బాపలేద।
రాజ్యంబుఁగొన రాముఁ బ్రార్థించు భరతుని
భుజముపై వెలయుచు బ్రోవలేద।
పరిణయకోపము వేళ రాము వేఁడిలినిఁగూడి
యింపార నను నూరడింపలేద।
అనిసేయు ఘనుపృష్ఠ యాలవారి శత్రుల
కెలిమి వీరస్వర్గమియ్యలేద।

గీ॥ ఇపుడు నామీదకోపమా కృపనుమాన।
ఘ సువర్ణుఁడనయ్యును కఠినుఁడైతి।
సతతరంగంబ, సాధితసంగరంబ।
ఉనుతరాంగంబ నాముద్దుటుంగరంబ॥

(ఆంజనేయునితో) తనయా! రాముఁడు క్షేమముగనున్నాఁడా? లక్ష్మణుఁడు నన్నెప్పుడైన స్మరించునా? అయోధ్యాపురినుండి వృత్తాంతమేమైనఁ దెలియుచున్నదా? భరతుఁడు నాయుదంతము నాకర్ణించి యుద్ధమునకై తన యక్షౌహిణీసైన్యమునంపఁదలఁచియున్నాఁడా? మాయత్తగారగు కౌసల్యాసుమిత్రాది దేవులకుఁ గుశలమా? అన్నరో! ఇంతకాలము నకు రామునకు సేవ జేయ శక్తికి వచ్చితినా? ఇంతవఱకు నన్ను పేక్షింప నేనేమితప్పుచేసితిని?

శా॥ అన్నా మారుతి! రామచంద్రుఁడు దయాహాసుండు సేమంబుతో।
నున్నాఁడా? సుఖియౌచు లక్ష్మణుఁడు నిత్యోత్సాహియై యున్నతో।
నున్నాఁడా? కుశలంబున భరతుఁడందున్నాఁడె మోదంబుతో।
అన్నా! సేమపువార్తఁ దెల్పి మదిలో నామోదముం గూర్పవే॥

అన్నా! నీయుపకారభరమును జన్మజన్మాంతరమందైనఁ దీర్పఁగలనా? నీ పరిశుద్ధమానసమెఱుంగక నిన్నుసందేహించినందునకై నన్నుమన్నింపుము.

ఆంజ॥ మాతా! అందఱును క్షేమముగానున్నారు. తల్లిరో! నీవయోధ్యాపురిఁ బాసినదాదిగా నెన్ని కష్టములఁబడితివి? రావణుఁడు నిన్నుఁగొనితెచ్చిన తఱువాత వృత్తాంతమేమి చెల్లెను?

సీ॥ వడినయోధ్యాపురంబు విడచినదాదిగా
కనరానికడగండ్లఁ గంటివమ్మ।
రఘురాముదేవివై రక్కసుచేఁజిక్కి
యువిద! యెంతటికష్టమొందితమ్మ।
జనయిత్రిమీతండ్రి జనకుఁడీవార్తల
నాలించి యింకెట్లు తాళుసమ్మ।
అమ్మరో! శ్రీరాము నభిరాముఁబాసి నీ
యురుదుఃఖమున నెట్టులుంటివమ్మ।
గీ॥ కుంతి! సాగరమెట్లు తరించితమ్మ।
దనుజకాంతలఁ గనియెట్లు తాళితమ్మ।
తల్లి! నీదగుచరితంబుఁ దాచకమ్మ।
యెల్లవృత్తాంతంబువచియించి యేలుమమ్మ।

జననిరో! ఆరామలక్ష్మణులనవరతము నిన్నే ధ్యానించుచున్నవారు. అమ్మరో! వారు నిన్నుపేక్షించినవారుకారు. నీవుండు నికృవము తెలియనందున వీరశిఖామణులయ్యు చేయునదిలేక యూరకున్నారు. ఇప్పుడు నీసేమవార్త తెలియుననెడియాశచే నారాకకై యెదురుఁ జూచుచుందురు. ఇఁక రామలక్ష్మణులను పావనవైశ్వానరులకులంక యాహుతి కాఁగలదు. నేను పోయిచెప్పిన యుత్తరక్షణముననే వానరసైన్యముతో రామ లక్ష్మణ సుగ్రీవులను సింహకిశోరత్రయమీ రాక్షససమూహముపైఁబడి, చక్కాడి, లోకమునంత

యు నిష్కంటకముగాఁ జేతురు. ఈలంక రక్తధారతోనిండి సముద్రమునఁగలిసెడి వేళయందైనను నీవు నమ్ముదువఁట లెమ్ము. జననీ! స్వల్పకాలములోనే యీ రాక్షసస్త్రీల యాక్రందనము వినఁగలవు. వేయేల? అఖిలమాతవగు నీసంకల్పమునకు వేరుకాఁగలదే? రావణుఁడిప్పుడు నీ యెదుటనాడినమాటలకు నేనే వానిని నూఫుమాపుచుంటిని గాని రామాజ్ఞలేనికతమున నూరకుంటిని.

అంజనాతనయా! నీయంతటి మహోదారుఁడు పుత్రుఁడుగానుండ నాకేమికొఱఁత? నేనురావణుచేఁజిక్కి కిష్కింధ సమీపమునయుండు ఋష్యమూకముమీదఁబోవుచు కొన్ని భూషణముల మూటఁగట్టి క్రిందసంచరించుచున్న కపులవద్ద నైచితి. ఈలంకచేరిన రెండుమాసములనుండి యీయరణ్యరోదనములకు లోనైతి. ఇఁక నాదుఃఖమున కంత్యముకాఁగలదని తలఁచెద. నీవీ యపారమగు సముద్రమును దాటితివి. లంకిణి మదమణచితివి. ఈమహాకార్య మితరులకు సాధ్యమగునే? నీయట్టివారు రామునకు బాసటగానుండ రావణుఁడుచచ్చుననియే తలంచెద. అయిన నింకెంత కాలమో యీయరణ్యరోదనమని యోచించెద.

దేవీ! అంతయేల యోచించెదవు? అధిరోహింపుము నాభుజములపై; కన్నుమూసి తెరచునంతలో నిన్ను రామ సన్నిధానమునకుఁ జేర్చెద. నాయంతటి పుత్రుఁడునీకుండ సామాన్యకామినిఁబోలె యోచింపఁబోలునే? పిదప మేమందఱమువచ్చి యీరావణుని, రాక్షసులను నేలపాలుచేసి, యీలంకను సముద్రమునఁ గలిపెదము.

అంజనాకుమారా! అందుకే నీకపిత్వము తెలియవచ్చుచున్నది. అన్నా! యిదిలగ్గుకాదు. నీవు నన్నుఁ గొనిపోవువేళ నీయల్పశరీరమునుండి వాయువేగమున క్రిందఁ

బడినను పడవచ్చుఁగదా? ఇదియుఁగాక రాక్షసులు నిన్నుఁజూచిరా తప్పక నిన్నడ్డగించి యని సేయుదురు. అప్పుడు కార్యమంతయు విఫలమగునుగదా?

ఆంజ॥ తల్లిరో! నీకుమారుని సామర్థ్యము నీవరయలేకపోతివి గదా? ఈరాక్షసులొక్కలెక్కయేల? లోకములన్నియు పైనెత్తి వచ్చినను శ్రీరామునను(గహము మొక్కటి యుండిన, నే నొకలెక్కగాఁ గొందునే? నన్నుసామాన్యకపినిగా నెంచకుము. ఇదిగో నాస్వరూపము. తిలకింపుము. (అని రామ ధ్యానముఁజేయుచు విశ్వరూపమును జూపును).

సీత॥ చాలింపుము చాలింపుము కుమారా నీరూపమును, నీపరాక్రమమును, నీయమోఘబలశక్తియు, నీరూపమును జూచితిని.

(అనగానే యాంజనేయుఁ డెప్పటిరూపమును గైకొనును)

అన్నా! నీవుసాటిలేని పరాక్రమవంతుఁ డవగుదువు. సందియ మేమియులేదు. అయినను నాకెందును దప్పగూడని వ్రత మొక్కటికలదు. అదేదియన జ్ఞానముచేతఁగాని యజ్ఞానముచేతఁగాని నేను వేఱొకపురుషునిశరీరము నంటఁ జాలను.

మ॥ అనఘా జ్ఞానముచేతఁగాని మరి యజ్ఞానంబునఁగాని బల్ ।
వనటల్ చెందినఁగాని శత్రువులునఁ బాధించినఁగానినా ।
తనువుచ్ఛేదనఁజేయఁగాని ఘనసంతాపంబునఁగాని రా ।
మునిఁగాకన్యునినంటఁజాల వినుమామోదంబునఁ మారుతీ ।

మైమరచి మూర్ఛిల్లియున్నతరి యీ రావణుఁడెట్లు తెచ్చెనో నాకుఁదెలియదు. మారుతీ! ప్రియకుమారునిఁ బోలు నీయట్టివానినిఁ జిన్నపుచ్చితినని నన్ను మనసునఁ గనలకుము. ఇదియుఁగాక యింతకాలము పగవానియింట

నున్నతనభార్య నెవ్వరెఱుంగకుండఁగొనిపోవుట శ్రీరాము నంతటివానికి సరివారిలోఁ దలవంపులగునుగదా?

హను || తల్లిరో! వెయ్యికారణములేల? శ్రీరామునిఁదక్క వేఱొకరినిఁ గలయందైనను స్పృశింపఁజాలనని యంటివికదా. అదియొక్కటియేచాలు నీపతివ్రతాప్రభావమునుఁ జాటుటకు. అవశ్యము నీయిష్టప్రకారమే కానిమ్ము. నాకు సెలవొసంగుము. అచిరకాలములోనే సూర్యచంద్రులఁబోలు రామలక్ష్మణులఁదోడితెచ్చెద. కోటిలో నగ్నియుదయించి నట్టు తల్లివగు నీ చల్లనిమానసమునఁ గోపము కలిగించిన రావణుఁడిక దక్కఁడు. నిక్కము.

సీ || తనయా! ఆరావణుఁడొనర్చు బాధలను నీవుకన్నులారఁ జూచితివికదా? ఇంక రెండు మాసములుమాత్రమేకదా నాకు గడవిచ్చియున్నాఁడు? ఈరెండు నెలలు రెండుయుగ ములుగాఁగడిపెద. ఎట్లోగడిపెద. అప్పటికిని రాముఁడు నాపైఁ గరుణమానెనా మీజననిని యీసీతను మఱచిపొమ్ము. అయ్యో! ఈకార్యము మిక్కిలి కష్టకార్యమని తోచు చున్నది. కపులీసముద్రము నెట్లు దాటుదురు. దాటిరిపో లంకనెట్లుచొత్తురు? ఇవియన్నియు మేఘములోని నీళ్లను నమ్మి సంతసించినట్లగుచున్నది.

హను || జననీ! సుగ్రీవాదికపులను సామాన్యవానరులుగా నెం చితివా? ఎంతటివెఱ్ఱితల్లివి? వారందఱు దేవాంశమున జనించినవారనుకొనుము. వారలలో నేనొక్కరుఁడను. నాకంటె తక్కువవారు లేరనుకొమ్ము. అందును శ్రీరా మానుగ్రహము కలిగియున్నవారికీ రావణాదులు తృణప్రా యులనుకొమ్ము. ఇఁక నాకు సెలవిమ్ము. శ్రీరామభద్రునకు నానవాలేమైననుండిన వచియింపుము.

సీత॥ అన్నా! రామచంద్రునితో దయాసాంద్రునితో నా మాటలుగా నిట్లనుము. పూర్వము చిత్రకూటమున నేను తనయంకవాళిపై శయనించియున్నతఱి యొక కాకాసురుఁడు నన్ను బాధింపఁగా దానిఁదెలిసికొని "తరుణీ! కాలమృత్యువునెదుర్కొన్న వాఁడెవఁడు" అని యొక్కతృణము నందు బ్రహ్మాస్త్రమభిమంత్రించి దానిగర్వమునణఁచిన నాఁటి దయారస మెందుఁబోయెననుము. 'నీజీవితేశ్వరిని, నిన్నునమ్మినజానకి నేలమఱచితివనుము. 'ఆనాఁడు నేనాపాపి జింకను కావలెననినదియే తప్పాయెనా' యనుము. ఇంత కాలము తాను పేక్షించిన నేనెందుంపుదాసననుము. 'వాలిఁ జంపినబాణమునకైన నాపైఁగరుణకలుగదాయెనా' యనుము. 'ఇఁకరెండునెలలు నీపైయాశచే నెట్లొ ప్రాణములభరిఁ చెద' ననుము. తల్లిదండ్రులమాని తన్నేనమ్మియున్న దానికిదియేప్రతిఫలమా యనుము. అనవరతము తననామస్మరణమున కాలముఁ గడువుచున్న దాస ననుము. అన్యమెఱుంగ ననుము. తనకంటెనాకొక్క దిక్కులేదనుము.

సీ॥ రాత్రింబవలు రామ రామా యనుచు సీత
నిన్నె ధ్యానించుచు నున్నదనుము।
ఇప్పుడో అప్పుడో నీవు నేగుదెంతువటంచు
జీవించియున్నది సీతయనుము।
దీనిదయాపర దీనరక్షకుఁడను
పూజ్యమహాబిరుదెందుఁ బోయెననుము।
ననుఁబ్రోవ నీచేతనన కాకయుండిన
పరగలక్ష్మణునైన సంపుమనుము।

గీ॥ ఇంక రెండునెలలు జీవింతుననుము।
నీవుపేక్షింప నాదురదృష్టమనుము।
ఇంపుమీఱఁగ ననుఁగరుణింపకున్న।
మహినియీసీతనిఁకమీఁద మఱవుమనుము॥

ఆంజ॥ అమ్మా! మాంబోటివారికి పదివేవురకు జ్ఞానముఁగలుపఁ జాలు నీవే యిట్లాలోచింపనౌనే? ఇచ్ఛామాత్రమున లోకముల సృజించు నాడిలక్ష్మివిగదా నీవు?

చ॥ కలఁగకుమమ్మ రాఘవునిఁ గాంచెదవమ్మ త్రిలోకమాత నీ।
వలగినఁజాలునమ్మ దనుజావళినీల్గదటమ్మ భద్రముల్।
కలిగెడినమ్మ శీఘ్రమునఁగాంతు సితోడ నయోధ్యఁజేరఁగా।
గలుగుదువమ్మ నన్నుశుభకార్యముతోడుతఁ బంపుమమ్మనీ।
వలసటఁబొందకమ్మ యిఁక నానతియివ్వగదమ్మ యమ్మరో॥

సీత॥ కుమారా! నీసాహసమునకును నీయెనలేని ధైర్యమునకును నారామలక్ష్మణులనుగొని తెచ్చి నన్ను రక్షించినఁగదా నాక్షేమము. ఇదే నాశిరోమణిక్య మిచ్చెదను. (అనిమాణిక్యమును చేతఁదీసికొని) ఓమాణిక్యమా! రామచంద్రునివద్దకుఁ బోయి నాతని వేగిరమె తోడి తెమ్ము.

మ॥ అలనాఁడా మిథిలాపురిం బరిణయంబౌవేళ నారామునీ।
వలరం జేసితి నాయయోధ్యాపురి నానామోదముం గూర్చితీ।
ప్రళయంబౌవిరహాగ్నిఁగూర్చితిపుడో ప్రాంచచ్ఛిరోరత్నమా।
తొలిదుఃఖంబులమాన్పి రామునిటకుం దోడ్తెమ్ముమాణిక్యమా॥
(మాణిక్యమిచ్చును)

ఆంజ॥ ఆహా! పరమయోగులకైనను, భక్తశిఖామణులకైనను, బ్రహ్మాదిదేవతలకైననుఁ బొందరాని నీకరుణాలోకముఁ గంటిని. ధన్యుఁడనైతిని. ఇదేనమస్కరించెదను. నాకాశిష మిచ్చిపనుపుము.

సీ॥ వందనంబులునీకు వందనీయచరిత్ర।
దండంబు శ్రీరాము ధర్మపత్ని।
అంజలియిదెనీకు నఖిలలోకారాధ్య
ప్రణతిఁ జేసెదనీకు పరమసాధ్వి।

జయమునీకగునమ్మ జనకరాజాత్మజ
బహునమస్కారముల్ భాగ్యనిలయ।
జోహారొనర్చెద శుభగుణాలయనీకు
సన్నుతి లోకైకజననినీకు।

తే॥ గీ॥ నీకృపాలోకనముఁజేసి నిఖిలదనుజ।
నిహతిఁగావించి జయముననెగడఁగలను।
సకలకల్యాణగుణజాత సర్వపూత।
మాత సీతాభిధాన యో మహిసుజాత

సీత॥ పుత్రా! నిన్నేమని యాశీర్వదింతును? చిరంజీవివగుమని యాశీర్వదింతునా? బ్రహ్మవరమున నిదివఱకేచిరంజీవివై యున్నాఁడవు. ఐశ్వర్యముకలుగునట్లు దీవింతునన్న నీతుచ్ఛములగు ప్రపంచసుఖముల నెడఁబాసి బ్రహ్మజ్ఞానము నొందిన బ్రహ్మచారివై యున్నాఁడవు. విద్యావంతుఁడవు కమ్మనియాశీర్వదింతునా సూర్యునివలండి సకలవిద్యలనభ్యసించిన నవవ్యాకరణ పండితుఁడవు. కావున నవియన్నియుఁగాక వేఱొకదీవెన నిచ్చెదను. నీకెల్లప్పుడును, యెల్లదశలందును, శ్రీరామచంద్రుని యందలి భక్తియుండుఁగాక.

ఆంజ॥ (సంతోషమున నెగురుచు) తల్లీ! నాకుకావలసిన వరమే యనుగ్రహించితివి. ధన్యుఁడనైతిని. పోయివచ్చెదను.

సీత॥ పోయివచ్చెదవా? పోయిరమ్ము.

(అనుబంధము 20)

వాయుకుమారా! లక్ష్మణునితో, నాప్రియమఱఁదితో నేను చెప్పినట్లు వచింపుము. "కన్నపుత్రునిఁబోలె నున్న తన్నరయలేక నేనాడిన దుర్భాషల మఱచిపొమ్మనుము. ఈచేతఁజేసిన పాపము నీచేత ననుభవించుచున్నాననుము. నేను మహాపరాధినైతిననుము; క్షమింపుమనుము. మఱఁదియైనను పుత్రుఁడైనను తానేయని నమ్మియున్నాననుము.

తనభక్తిపూజల మఱువలేదనుము. రాముఁడు సేక్షించినను, బంధువులు దూకరీరించినను, సీత నిన్నొక్కనినే నమ్మియున్న ద''నుము. భరతశత్రుఘ్నులకు నాసేమముఁ జెప్పిపంపుమనుము. సుగ్రీవుని చాలనడిగితిననుము. అన్నరో! నీవున్నంత పఱకును నాశోకమునంతను మఱచియుంటిని. ఇఁక నాకెవరు దిక్కు? నన్నుఁబాసిపోయెదవా? నన్ను రాక్షసులకప్పగించి పోయెదవా? రామా! రామా! ఇనవంశక్షీరాబ్ధిసోమా! హా! జనకా! జనకా! (మూర్ఛిల్లును).

ఆంజ అకటా! ఈదేవి దుఃఖసముద్రమునమునిఁగినందున నేను పోయెదనన్నమాత్రముననే మూర్ఛిల్లెను. నేనుండుకొలది కాలాన్యమగును. ఈదేవికిసంతాపము హెచ్చగును. కావున వెళ్ళనేనలయు. అదిగో! రాక్షసస్త్రీలొక్కరొక్కరు మేల్కొనుచున్నారు. ఏమిచేతును! నాకు కార్యములు మెండుగనున్నవి. ఓధర్మదేవతలారా! సూర్యచంద్రులారా! భూమ్యాకాశములారా! వనదేవతలారా మాజానకీదేవినిఁ గాపాడుఁడు.

సీ॥ జనకునిపుత్రినీ జననిరక్షింపరే
దివిమించు శ్రీధర్మదేవులార।
దశరథుకోడలీ తల్లిఁబాలింపరే
జగతిమించెడు సూర్యచంద్రులార।
శ్రీరాము దేవినీ చెలువఁగాపాడరే
రాజిల్లు నుద్యానలక్ష్ములార।
త్రైలోక్యమాతనీ తరుణినిబ్రోవరే
పొలుపారు నాకాశభూములార।

గీ॥ పౌరులార, వినోదకకీరులార।
చారులార, ఘనాటవీచారులార।
మానులార, పవిత్రాంగధేనులార!
మొనసిమాతల్లినిపుడు పాలింపరయ్య॥

(నిష్క్రమము).

శ్రీ

# విభీషణ పట్టాభిషేక నాటకము.

## చతుర్థాంకము.

ప్రథమరంగము—లంకాపురము.

అదేయరణ్యమున మఱియొకభాగము.

(ప్రవేశము : ఆంజనేయుఁడు)

ఆంజ ॥ శ్రీరామానుగ్రహమున వచ్చిన కార్యము సాధించినట్లయ్యెను. సకలలోకపూజనీయుఁడగు శ్రీరామునాజ్ఞకెందైన భంగముకలుగునే? ఇఁక రామదర్శనమునకు పోవుటయే కదా నాకుఁగర్తవ్యము? ఔరా! ఇంతటితో తృప్తినొందియూరకవచ్చిన త్రోవపోవచ్చునే? క్రొవ్వి యెందునుసరిలేక విఱ్ఱవీగుచున్న రావణునకొక్కగురుతైనఁజేయకపోవచ్చునా? ఒక్కకార్యముఁజేయుచో ననేక కార్యఫలములను సాధించువాఁడెవఁడో వాఁడేకదా దూతయనబడుచున్నాఁడు. ఈ యశోకవనమునంతయు పెరికి నేలపాలుఁ గావించెదను. అప్పుడుదాని నెల్లవేళలరక్షించు రక్కసులు నాపైకివత్తురు. వారినందఱిని తోరణస్తంభమునకు బలియిచ్చెదను. అదియే నన్ను రావణునకుఁదెలుపఁగలదు.

(అనివనమును ధ్వంసము చేయును). మహాధ్వనితో రాక్షసులందఱును పరుగెత్తివత్తురు).

(అనుబంధము 25)

రాక్షస ॥ ఓరీ! వానరా! ఎవ్వఁడవురానీవు? మావనమేల ధ్వంసముచేసితివి? చచ్చితివింక చెప్పుము.

(ఆంజనేయుఁడు వారినందఱినికొట్టును. కొందఱు చచ్చిపడుదురు. మఱికొందఱు పరిగెత్తిపోవుదురు).

(యవనికపడును)



# విభీషణ పట్టాభిషేక నాటకము.

## చతుర్థాంకము—ద్వితీయరంగము.

### లంకాపురి—రావణునాస్థానము.

[రావణుఁడు సింహాసనమున నుండును. విభీషణ ప్రహస్తాకంపనులు ఇంద్రజిత్తును, రాక్షసభటులును, నుందురు.]

(అనుబంధము 26.)

రావణ॥ కుమారులారా! సచివచంద్రులారా! వింటిరికదా విషయములనన్నిఁటిని? ఇట్టి యబ్బురపు వృత్తాంతము మీరెన్నఁడును విని యుండరు. ఏవఁడో యొక కోతియఁట! మనయశోకవనమును నిశ్శంకముగఁజొచ్చి నేనెంతయో కాలమునుండి కనుగారాబమునఁ బెంచియుండిన దానినిఁ ద్రుంచెనఁట! అందుకై మనదానవవీరులు నోహటించి మర్కొన్న వెంటనే దావాగ్నిశుష్కతృణంబుల దరికొనినట్లందఱిని సంహరించెనఁట! ఇదియంతయు మదీయ్యకీర్తిచంద్రికకు మిక్కిలి న్యూనతకదా? ఆకోతిని పరిమార్చుటకై విరూపాక్షయూపాక్షాది సేనానాయకులు సైతము వెడలియుండిరికదా? వారిగతియేమయ్యెనో? యింకను చారులు రారైరి. ఈవిషయముతలచుకొన్నంతనే మహాఘోరము. ఒకపరియాశ్చర్యమును, నొక్కపరి తలమున్కలుగావచ్చు లజ్జయును నన్ను ముంచుచున్నవి. ఏమియుఁ దోపకున్నది. ఈవిషయమై మీమీయభిప్రాయములేమి?

విభీషణ॥ అగ్రజా! ఇదిసామాన్య వానరముకాదు. నాకుఁజూడ నింద్రుఁడో, చంద్రుఁడో, లేక యుపేంద్రుఁడో, కానోపునని

తోఁచుచున్నది. అంతయేల? నీవుకైలాసపర్వతము నెత్తి
నప్పుడు నందీశ్వరుఁడు నిన్ను శపింపలేదా? ఆనందియే యీ
రూపమున వచ్చెనో? తెలియదు. ఇదియుఁగాక దేవతలం
దఱునా విష్ణుమూర్తిని శరణువేడిరఁట! ఆవిష్ణువు వారికభయ
మిచ్చెనఁట! తాను రామావతారమునొంది లంకను నాశ
నము చేయునట్లు వరమిచ్చెనఁట! ఈ వృత్తాంతమును
మొన్ననే మనము వినలేదా? కావున నిన్నియనర్థములకు
మూలమగు యీసీతాదేవిని రామునికప్పగించుటయే మం
చిది. నీకు వచింప నేనెంతటివాఁడను? ఇందుపై నీయిష్టము.

ఇంద్ర ॥ తండ్రీ! మాపినతండ్రి విభీషణునిమాటలు విశ్వసనీయ
ములు కావు. అతఁడెప్పుడును ధర్మశ్రవణములఁ జెప్పుట
యందు నిపుణుఁడుకాని యుద్ధమన్న మూఁడామడల దూర
మందుండువాఁడు. అట్టివాఁడు గనుకనే మనమేయుద్ధమున
కును సీతనినిఁ బిలుచుకొని పోవకుండుటఁ నీవెఱుఁగవా?
విష్ణువఁట! రాముఁడయ్యెనఁట! సీతనప్పగింప వలయునఁట.
పై సమరము చేయవచ్చు శాత్రవులఁ బరిమార్చుటొండె,
లోకోన్నత వీరస్వర్గ మొందుటొండెగదా శూరకోటికిఁ
గర్తవ్యము?

రావణ ॥ భళీరే కుమారా! నీశూరాలాపములు మిక్కిలి సంస్తవ
నీయములు. విభీషణా! ఈపిఱికిమాటలనెందు నేర్చుకొం
టివి? పరాక్రమ మహిమాంచితుఁడగు రావణబ్రహ్మకు
సోదరుఁడవై, యింద్రజిత్తునుబోలు వీరాగ్రేసరుల పుత్త్రులు
గాఁబడసియు, శూరకోటియెంతయు హసింప, నిండోలగమున
నిట్టిమాటలాడెదవే? పోపొమ్ము. మత్తేభకుంభ విదారణ
పటిష్ఠంబగు రాజసింహ మొక్క మృగమునకై గుహలోదాగి
యున్నదెందైన వింటివే? ఇంచుక కనుబొమయుడిన మా
త్రమున సురాసురవర్గంబులు తమప్రాణంబులపై యాశవదలి
దాసోహమని శరణొందనా? ఆవిష్ణుఁడనఁగ నెంతటివాఁడు!

నేకసిమసంగిన నేకాక్షౌహిణీ రాక్షసవీరులతోఁగూడి యా
ముకుందుని పైదండెత్తినవేళ దొంగయై యెందోదాగి
యున్నవాని నొక్క వీరుఁడని నాయెదుట పలికెదవా?
తుదకు వానిచక్రంపు విక్రమమునుచూప నెత్నించిన నాటి
గురుతులు సైతము నాశరీరంబున నిప్పుడురాజిల్లు చున్నవి
గదా? ఇఁకనీవాడకుము. ప్రతిపక్షవర్గంబుల రూపుమాపి
సత్కీర్తి నైన ఘటించెదను. లేదేనిసమరరంగమున నద్భు
తరీతి యుద్ధమాడి, వైరులకసిదీర చక్కాడి, శూరజనైక
శరణ్యమగు వీరస్వర్గమైన నందెదను.

పంచపాది॥ అరరేసర్వదిగంతముల్ గెలచినిత్యానంతసత్కీర్తినై।
వరలోకంబులనేలిసర్వ సురులవ్యాజంబునన్గొల్వగా।
నిరతంబొప్పెడురావణుండు నరునిన్సేవించునే చూడ।
ధీరరహీన్ నేజయమైన చచ్చిఘనవీరస్వర్గమైనన్ మహా।
దరణాన్గొందునునే విభీషణమనస్తాపోక్తిచాలింపుమా॥

ఇఁక యిట్టి భీరవచనంబుల నాయెదుటఁ బలుకకుము. ఇది
యేనానిర్ధారము. సీతనివ్వను. ప్రాణంబులపై నరకుగొనను.
సత్కీర్తిని యనాదరింపను. వింటివిగదా?

(ప్రవేశము: రాక్షసులు ఆతరముతో)

రాక్షసు॥ దేవా! రావణచక్రవర్తీ! పరాక్ మమురక్షింపుము
రక్షింపుము. మనధూమాక్షాది రాక్షసులందరు నాకోతి
చేఁజచ్చిరి.

రావణ॥ ఏమి? యేమి? మనధూమ్రాక్షుఁడు చచ్చెనా?
అక్కటా! శూరాధిశూరుల కిట్టిపాటురాఁజెల్లునే? కానిమ్ము
(కోపముతో) దైత్యవరులారా! ఇఁకను పేక్షింపరాదు.
చించిచెండాడెదనా వానరమును. ఆ నిటలాక్షుఁడు కట్టె
దుట నిలచినను, యేనృసింహుఁడు నన్నుమార్కొనినను,
వానినొంచెద. సురాసుర కిన్నరకింపురుషుల సమరాంగణ

మ్మున నిర్ధూమధామమొనర్చెద. ముల్లోకములనల్లకల్లోలము( జేసెద. యక్షరాక్షసులకు నచ్చెరువు( గావించెద. కదనరంగమున మత్ప్రతాపవహ్నిజ్వాలల కెవ్వ(డెదురు గా( గల(డో చూచెద(గాక ప్రహస్తా! కొనిరమ్ము నాధనుర్బాణ సందోహంబుల.

(అనుబంధము) 27.

ఇంద్ర॥ జనకా! ఈయల్పకార్యమునకై తాముపోవలయునా? నాయట్టిహానిని కుమారునిగా( బడసియుండియు మీరుచన వలయునా? తామించుక నిశ్చలింపు(డు. వా(డెవ్వ(డైననేమి? మదీయశస్త్ర పరంపరలకు వానిప్రాణంబుల లాహుతి(గొని యెదను. లేదేనివాని( తమ పాదసన్నిధానమునకు( గొని తెచ్చెద. నన్నువైశమే పనుపు(డు ఇంతకై తామింత యోచింపవలయునా?

ఉ॥ ఇంతటిచిన్నకార్యమున విటుపోవగనేలతండ్రిరో।
సంతసమొప్పనన్ను నుపు చయ్యనవాకపిఁబట్టి తెచ్చెదన్।
వింతగరుద్రు(డడ్డపడివే(డిన వానిని పట్టితెచ్చెదన్।
వంతతొలంగినన్నిటు శుభంబునపంపుము దైత్యచంద్రమా॥

అకంప॥ దేవా! మనయువరాజుగారికేల యింతటిశ్రమ? మీ దాసుని నన్నునుపు(డు. ఆకోతినికాదు అన్నిజగంబులను నొక్కమొత్తుగ నెత్తికొనివచ్చెద. దేవేంద్రు(డు, రుద్రునంతటివారికైన మన యువరాజుగారి కాజ్ఞయివ్వవలయు(గాక యీదూదికై కార్చిచ్చుకావలయునే?

ప్రహస్త॥ దనుజనాయకా! ఈకోతికై మీరేల కావలయు? మన యింద్రజిత్కుమారు(డేల కావలయు? ఇ(కనీయకంపను( డన్ననో, మొన్నయమునితో( బోరినప్పుడు మిక్కిలి విక్రమమునుచూపికడుబడలియున్నా(డు? వానినేలపనుపవలయు? నే(బోయెద. ఇప్పుడేయాకోతిని( బట్టితెచ్చెద.

అక్షయ ॥ జనకా! నావిన్నపమాలింపవలయు. మీరందఱు నొక్కొక్క రొక్కొక్క జగమును జయించువారు. ఇంద్రునితోఁబోరి జయించి యగ్రజుఁడీ యింద్రజిత్తనెడి యనుపమ కీర్తినిఁ జేకొనెను. అప్పుడేకదా యింద్రజిత్తనెడి పేరీతనికిఁగలిగినది. ఇఁక ప్రహస్తాదులన్ననో యనేక యుద్ధములం దారి తేరి జగత్ప్రసిద్ధిని గాంచియున్నవారు. నీనందనులలో నేనొక్కరుఁడనే యూరుపేరులేక యున్నవాఁడను. నాకునుకీర్తిని సంపాదించుకొను కాలముఘటిల్లినది. కావున నన్ను కరుణించి పనుపుము. నేనాకపిని, వానిసహాయులగు వారినిఁ జక్కాడి మరల మీసన్నిధానమునకే తెంచెద.

రావణ ॥ కుమారా! అక్షయా! ఇప్పుడుకదా నీవు నాకుమారుఁడనుటకు సార్థకము. సింహము గర్భమున సింహమేగదా పుట్టును. కానిమ్ము. నిన్నేపంపెదను. ఐనయుద్ధమున మిక్కిలి జాగరూకుఁడవై యుండుము. అన్నా! నీవు మహాసుకుమారుఁడవైనను శూరధర్మమునుబట్టి నిన్నుఁబంపవలసివచ్చెను. శుభంబునపోయిరమ్ము. జయమునుచేకొమ్ము. ఆకపిమహావీరుఁడే? వానినిజయించెదవా?

మ॥ సుకుమారుండవు యుద్ధరీతి మహిఁగా చూడంగ లేదెప్పుడుఁగా ।
అకలంకంబగునీదు మేను తనయా! ఆలంబునఁగా తాళునే ।
అకటా నీయభిలాషకై పనుపగానయ్యో నగదా నేఁడునీ ।
వికమోదంబుగపోయిరమ్ము శుభముల్వొల్గొందు నీకక్షయా ॥

అక్షయ ॥ జనకా! సందేహమేల? అగ్నికిచెదలంటునా? చూచెదవాఁడెంతటి శూరుఁడో.

చం॥ ధరణినినింద్రజిత్తునకు తమ్ముఁడనై వరధాన్యమాలికిఁగా ।
మురిపెపుపుత్రుఁడై దనుజమూర్ధననీకు తనూజుఁడై మహా ।
దురితముచేయు నొక్కకపిదూలగ చేయగజాలకున్ననా ।
పరువము దేలజన్మమును పౌరుషమేల సురారిచంద్రమా ॥

ఇంద్ర ॥ సోదరా! నీయభిలాషకుమారు చెప్పరాదని యూరకుంటిగాని యనేకయసురబాలకులతో జయంతనలకూబరాదులు చరణశేవఁజేయుచుండ పరమానందమునందుండువాఁడీపుడా ఘోరరణరంగముల నెట్లుతాళుదువు? వలదు. నేనే యావానరమును తెచ్చుటకై పోయెద.

సీ॥ లేయెండవశివాడు లీలనీనెమ్మేను
దారుణాయుధముల తాళఁగలదే।
చిగురాకుసొంపుల చెలువొందుహస్తముల్
వరధనుర్బాణముల్ పట్టఁగలవె।
చెలికాండ్రమాటాడ నలయునీనెమ్మోము
సింహానినాదంబుచేయఁ గలదె।
పట్టుశాలువబూన భారమానను నీవు
మూపునతూణీని మోయఁగలవె।
గీ॥ తెరచితెరవకనీరేజ సరణిమించు।
ఒప్పునీకన్నుగవ కోపమూనఁగలదె।
యెట్లుపోయెదో యాకోతినెట్లుకనెదో।
వత్సనామదిచింతలఁ బరగెనకట॥

అక్షయ ॥ అగ్రజా! నిరంతర పరాక్రమమున ధనువుచేనందినవెంటనే త్రిలోకముల చీకాకుపడచేయఁజాలనా? రణమునప్రవహించు రక్తధారతడిసి రక్తాంబరధారిణియైవెలగొందు విక్రమలక్ష్మినిచే కొననెంచిన నీవీరశిఖామణికి నీవింతచెప్పవలయునా? చాలు దనాప్రతాపముజగమునందంతయు.నొంచెద శత్రుస్తోమంబుల. పాలియించెద దేవసముదయంబుల.కలిగించెదనీతమ్ముడనుటకు సార్థకత. ఇదియే ధనువు. ఇయ్యదియేకరవాలము. ఇవియే బాణములు. ఇవియే నాకానందము నిచ్చునవి. ఇకనన్నాశీర్వదించి పంపుడు. (అనితండ్రికిని అన్నకును నమస్కరించును)

ఇంద్ర ॥ అక్షయా! నీవింతయభిలషించిన యశస్సుముపోయిరమ్ము. నీకుశుభంబగుఁగాక. (యవనికపడును)



# విభీషణ పట్టాభిషేక నాటకము.

చతుర్థాంకము—తృతీయరంగము.

అశోకవనము.

(ప్రవేశము : ఆంజనేయుఁడు)

ఆంజ ॥ రాక్షస వినాశనవ్రతము ముగియుచునచ్చె. జంబుమాలియను శూరుఁడుచచ్చె. సేనాపతు లేవురు యమునిచెంత కేగిరి. ఇంకయెవ్వరు వత్తురో చూచెదఁగాక. (నలుదిక్కులఁ జూచి) ఆహా! అందెవ్వఁడో బాలుఁడొక్కఁడు వచ్చుచున్నాఁడు. యుద్ధమునకే వచ్చుచున్నట్లున్నది.

(ప్రవేశము అక్షయకుమారుఁడు సైన్యముతో పాడుచు)

(అనుబంధము) 28

అక్షయ ॥ రాక్షసవీరులారా! ఇది యేనాయీ చెనటికోతి? (ఆంజనేయుని చూచి) ఓరీ! నిన్ను యముఁడు పేరంటమునకు పిలుచుచున్నాఁడా? కుందేలు వంటయిల్లుచొచ్చినరీతి నీవేల మాలంకఁజొచ్చితివి. చొచ్చినదిగాక యేలమాతోకంటుగట్టుకొంటివి? నీవెవ్వఁడవు? నీ నిజమైన వృత్తాంతము దెలిపితివా మాతండ్రిపాదములపై వైచి నిన్నెట్లయినను క్షమించునట్లు చేసెద.

ఆంజ ॥ బాలకా! నీవెవ్వరి పుత్రుఁడవు? ఎవ్వరు చెప్పిరి నీకీ మాటలు? సుకుమారుఁడగు నీమాటలకు సంతసము కలుగుచున్నదె. అయ్యో! పాపము! నీవుచూడ యుద్ధమునకు వచ్చినట్లున్నావు. ఎందుకు వచ్చితివి? పోయి సుఖముగ నాట్లాడుకొనుము. పొమ్ము.

అక్షయ ॥ నేను రావణుని పుత్త్రుఁడను. నన్నక్షయకుమారుఁ డందురు. యుద్ధమునకై వచ్చియున్నాను. నాయాటలనే నాడునదేగాక యెదటవారిని సైతమాడింపఁగలను. ఇదిగో! చూడుము (అనిబాణమువేయును).

ఆంజ ॥ ఐననామాటలవినవు?

అక్షయ ॥ నీమాటలేమి వినునది. నామాటవినిన యింటికి మరలి పోయెదను.

ఆంజ ॥ ఏదినీమాట?

అక్షయ ॥ నీవెవ్వఁడవో చెప్పి మాంకుశరణొందుటయే నామాట.

ఆంజ ॥ ఐననాయత్నములేదు. నీకునూరేండ్లునిండినవి.

(అనియిరువురు యుద్ధమాడుదురు).

ఆంజ ॥ ఆహా! వీడుపసిబాలుఁడని యుపేక్షింపరాదు. వీని తేజమును పరాక్రమమును నద్భుతము నించుచున్నవి. కావున నాశక్తినింత కనుపరచివీనిని కడ తేర్పవలయు. (అని ముష్టితో నక్షయునిఁగొట్టును. సైనికులు పరువెత్తుదురు. అక్షయుఁడు క్రిందపడిచచ్చును).

(ప్రవేశము; అతికాయుఁడు పాడుచు)

(అనుబంధము 29)

అతి ॥ వానరా! ఇంతటితో సంతోషింపకుము. యుద్ధమున జయాపజయములు దైవాధీనములు. రమ్ము. నాతో మార్కొనుము. ఆరుచినింత యెఱిఁగెదవుగాక.

ఆంజ ॥ (స్వ) ఎవ్వరీపసికూన? పరమాద్భుత తేజమున లోకమునే ప్రకాశింపఁ జేయుచున్నాఁడు. మోమున బ్రహ్మతేజ ముట్టి పడుచున్నది. (ప్ర) బాలచంద్రమా! నీమోముఁ జూడ పున్నమనాటిచంద్రుని రీతివెలుఁగుచున్నది. నీకేల యుద్ధము? నీతల్లిదండ్రుల ముద్దులఁబడయుము. పొమ్ము. నాయనా! నీవెవరు?

అతి ॥ నేనెవ్వఁడైన నీకేమి? ఎవ్వఁడెవ్వఁడో, అంతయునెవ్వఁడో, ఎవ్వని నెవ్వరెఱుంగరో, నీవు నేను నెవ్వఁడో వాఁడె నేను.

ఉ॥ ఎవ్వనిచేజనించు జగమెవ్వనియందు వశించునంతయు।
నెవ్వఁడుభూతజాల భవుఁడెవ్వఁడునీవును నేను వాఁడనఁ।
యెవ్వఁడు యెవ్వడంచునను నెవ్వఁడునంతట వెల్గువాఁడుతా।
నెవ్వఁడువాఁడె బోవినుమయేనిక పల్కులువేయినేటికిఁ

ఆంజ ॥ (స్వ) ఏమిది వీనిమాటలాశ్చర్యముగానున్నవి. (ప్ర) కుమారా! నీకేమిపిచ్చిపట్టినదా? ఏమేమోమాటలాడుచున్నావు?

అతి ॥ నిజము. అందఱు పిచ్చిచేతనే యావరింపఁబడి యున్నారు. పిచ్చిలేకున్న నేదియులేదు. పిచ్చియుండిన నంతయుఁగలదు.

గీ॥ పుట్టుటయెపిచ్చి తానింకగిట్టపిచ్చి।
యిల్లువాకిండ్లు నిల్లాండ్రునెల్లపిచ్చి।
బంధువర్గంబుసంపదల్ బలముపిచ్చి।
పిచ్చివదలినమోదంబు హెచ్చుజగతి॥

ఆంజ ॥ (స్వ) వీఁడుబ్రహ్మజ్ఞానిగా మాటలాడుచున్నాఁడు. చూడఁబో యిన కసిగందువు. (ప్ర) అయ్యా! నీవెవ్వరికుమారుఁడవు?

అతి ॥ నీకేలనయ్యా యీ బంధుత్వ విచారము? మాతండ్రి యెవ్వరైననేమి? పైనాలము చేయవచ్చిన పగవాని కుల గోత్రములు విచారించువాఁడవు నీవేమిశూరుఁడవు?

ఆంజ ॥ నీవు యుద్ధమాడెదవా? నీవలెనేవచ్చి యుద్ధమాడిన యీబాలుని గతియేమైనదో చూచితివా? నీపై చెయ్యె త్తవలయునన్న మృదువైన కుసుమరాజము నలచియగ్ని గాల్చిన వాని చందమగుచున్నదికదా? పశిబాలుఁడవే?

అతి ॥ ఏమయ్యా! నీకోఁతిచేష్టల విడువవుకదా? బాలకుఁడు. బాలకుఁడు అని వదరుచున్నావు. నేను బాలకుఁడైన నాశక్తి బాలకుఁడా? భీకరహాలాహల మెంతయుండినను, నొక బిం దువు విజృంభించిన లోకమునుదహింపదా?

ఆంజ ॥ వలదయ్యాయుద్ధము. నీమాటలకుమెచ్చితిని. కోరుము నీకోరిది తెచ్చి యిచ్చెదను. మరలయింటికిపొమ్ము.

అతి ॥ లంచమిచ్చి శత్రువునింటికి పంపెదవా? నీవేమయ్యా యిచ్చునది? నీకును, నాకును లోకమునకును నిచ్చువాఁడు వేరొక్కఁడున్నాఁడు. నీవై యిచ్చెదనన్న వలదనను. నాకు యుద్ధమిమ్ము.

ఆంజ.॥ ఐన నీవు మానునట్లులేదు? నన్ను సామాన్యవానరము గానెంచకుము. నేనుధీరుఁడను.

అతి ॥ నీవాధీరుఁడవు? నలుగురిపనికిమాలిన రక్కసులనుజయిం చినంతనే నీవొక్కధీరుఁడవా? లోలోన వృద్ధిపొందుచున్న యింద్రియములనుశత్రువులను జయించినకదాధీరుఁడగుదువు?

సీ॥ గురుదైవమనకపై నరుదెంచుకోపంబు
శత్రువునింతైన సరకుగొనక।
ఏదిచూచినగాని నాదియంచనులోని
నిరతలోభంబును నిక్కనీక।
మదిలోనతానెక్కి మనుజునినాడించు
మదమును లోలోన కదలనియక।
వడినయంతనెమోహ మడరించువాల్గంటి
వాలుచూపులనింత డీలుపడక।

గీ॥ పరులసంపదతిలకింప బాధనించు।
మేలిమాత్సర్యమును నింతమెదలనీక।
మీరివర్తించువాఁడెపో ధీరుఁడెందు।
ధీరవర్యుండవే నీవు తెలియవలదె॥

నాకుమాటల కవకాశములేదు. చాలితేని రణశూరుఁడవేని నిలువుము. కాదేని భీరుఁడవై కాలికి బుద్ధిచెప్పుము. (అని బాణము వేయును).

ఆంజ ॥ (స్వ) నేను వీనినేమియు చేయజాలకున్నాను. వీఁడునా కంతయు చేయుచున్నాఁడు. శ్రీరామా! నేనునీకునిక్కం పుభక్తుఁడనగుదునేని ఈముష్టిచే నీదైత్యుమృతుఁడగుఁగాక (అనిబాలకునిపై పోయిముష్టియెత్తును).

అతి ॥ (రామధ్యానము చేయును)

(అనుబంధము 30)

ఆంజ ॥ (నాట్యముచేయును)

ఆహా యిపుడు తెలిసెను. యితఁడును మహాశ్రీరామ భక్తుడుకాబోలును. (పోయి యాలింగనమొనర్చుకొని) అయ్యా! నీమహిమంబును నెఱుఁగనైతి. బాలకా! మనమిరువురము రామభక్తులమగుటచే సహోదరులము.

అతి ॥ అయ్యా! నీవును రామభక్తుఁడవా? ఆహా! యిపుడు జ్ఞప్తికివచ్చె. ఒకానొక మహాసీయుఁడు "నీవు, రామభక్తుఁడగు కపియొకఁడు లంకకు వచ్చినంతటనే, శ్రీరాముని చూడగల్గుదవు" యని నుడివియుండెను. నీవేకాబోలును యాకపి. ఐన నీతోనేలనాకు యుద్ధము. నేపోయివచ్చెద. నీకు శుభంబగుఁగాక.

(నిష్క్రమము)





# విభీషణ పట్టాభిషేక నాటకము.

చతుర్థాంకము—తురీయరంగము.

అశోకవనము.

(ప్రవేశము: రథముపై యింద్రజిత్తు)

ఇంద్ర॥ ఆహా! ఇంతటి పాటుశూరకోటికి రానేర్చునే? వీరాధి వీరులకు విక్రమము నేర్పు మా యక్షయకుమారుఁ డొక్క కోతిచేఁజచ్చెనన్న నెంతయో దుఃఖమును, సిగ్గును కలుగు చున్నదిగదా? అందుకై మాతండ్రి రావణుఁడు మహా విషాదమున మునిఁగియున్నవాఁడు. ఈవానరమెక్కడనుండి వచ్చెనో మాకు? అకటా! పసిమిబంగారు ఛాయమించు మా యక్షయకుమారుని నెమ్మేనుకసిగందు చేసినవాని కించుకయైన నక్కటికము కలుగకపోయెఁగదా? కానిమ్ము. వానిమదమణఁచి నాతమ్మునికి ప్రీతిచేసెదఁగాక.

సీ॥ అంటినకసిగందు నక్షయుచెక్కుల
బాణంబుగ్రుచ్చిన పాపుఁడెవఁడొ।
లేమృణాళమ్ముల లేలెమ్మనెదుబాహువుల
నొవ్వఁజేసిన కలుషుఁడెవఁడొ।
విరిదామరలగేరి విలసిల్లుకన్నుల
నీరుదెచ్చినమహా నీచుఁడెవఁడొ।
రాలక్ష్మినటియింప రంగారునంగంబు
బలురక్తమునముంచు తులువయెవఁడొ॥

గీ॥ అట్టివానిని సదలించి యడచిపొడచి।
పొంచివధియించి విదలించి దృంచిమించి।
నొంచిఖండించి తునియించి యుక్కడంచి।
నలచిచంపెద నాకున్న చలముదీర॥

(కొంతదూరముపోయి) అదిగో! ఆకపి యిక్కడికే వచ్చు చున్నట్లున్నది. ఆహా! ఇదెక్కడికోతి? ఆకారముఁజూడ నాశ్చర్యము కలిగించుచున్నది.

(ప్రవేశము: ఆంజనేయుఁడు)

ఇంద్ర॥ ఓరీ! వానరా! నీవెవ్వఁడవు? నిన్నెవ్వరుపంపిరి? నిక్క ముగ వచియింపుము.

ఆంజ॥ నేను రామునిబంటను. నన్నంపినది నీపాలిటి మృత్యు దేవత.

ఇంద్ర॥ ఓరీ! రామదూతా! గర్వించి మాటలాడెదవా? లంక లోఁజొచ్చి కొందఱి కావలివారిని జంపినంతనే నీకావరము హెచ్చినదికాఁబోలు? ఇఁకనాచేఁజచ్చితివి. మరల నీబంధు వులను చూచెడి పుణ్యము నీకులేదు. ఈ యింద్రజిత్తు పరాక్రమమెఱుఁగవు.

ఆంజ॥ అది యున్నదో లేదో నీ తమ్ముని నక్షయకుమారుని నడుగుము.

ఇంద్ర॥ ఇదిగో నాబాణములే నిన్నడుగుచున్నవి.

(అనుబంధము 31)

(యుద్ధముచేయుదురు.)

ఇంద్ర॥ (స్వ) ఈకపి మహాపరాక్రమవంతుఁడని తోచుచున్నది. వీనిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించెదను.

(బాణము వేయును.)

ఆంజ॥ (స్వ) ఆహా! ఈ యింద్రజిత్తు మహావీరుఁడని తోఁచు చున్నది. నన్ను బ్రహ్మాస్త్రమున చంప యత్నించి నాపై ప్రయోగించెను. శ్రీరామానుగ్రహమునను, సీతాదేవి యాశీర్వచనప్రభావమువలనను, బ్రహ్మాస్త్రము నన్ను బంధించెను. బ్రహ్మదేవుఁడు పూర్వము నాకీయస్త్రమునుజయించు సామర్థ్యమునిచ్చియున్నాఁడుకాని యిప్పుడామహాస్త్రమును గారవించుటకై లోఁబడియుండెద. ఇదియుఁగాక రావణుని చూడవలెననెడి యభిలాషయు నాకుఁగలదుకదా? ఇప్పుడు నాకిది మిక్కిలి సహకారి. (అని బ్రహ్మాస్త్రమునకటువడును)

ఇంద్ర॥ ఆహా! ఏమాశ్చర్యమిది? బ్రహ్మాస్త్రమునకు బలమేమైన తగ్గెనా? లేక నే నింద్రజిత్తునుకానా?

సీ॥ ఐంద్రాస్త్రముననిన్ను నరిచంపఁజూచిన
నేలకోదానిచే నీల్గవైతి।

ఆంజ॥ అలయుపేంద్రుఁడునొచు నలరారుశ్రీరాము
కృపగల్గ నైంద్రాస్త్రమేమిచేయు।

ఇంద్ర॥ ఘనతవాయువ్యాస్త్రమున చంపనెంచితి
నీవేటికోదాన చావవైతి।

ఆంజ॥ ఆవాయు ప్రియపుత్రుఁడైయొప్పు నాకు నీ
నెనయువాయువ్యాస్త్రమనఁగనెంత।

ఇంద్ర॥ ఆగ్నేయబాణాగ్ని నట్టెనిన్గాల్పఁగా
కడఁగిననేలకో కాలవైతి।

ఆంజ॥ సూర్యాగ్నినేత్రుఁడై శోభిల్లురాముండు
కాపాడనాయగ్ని కణములెంత।

ఇంద్ర॥ గీ॥ ఇపుడుబ్రహ్మాస్త్రమున చంపనెంచియుండ।
కనఁగనాయస్త్రమేలకో కట్టివైచె।

ఆంజ॥ బ్రహ్మజనకుండునై యొప్పుపరమపురుషు।
కరుణగలవారు కడగండ్లగాంచగలరె॥

ఇంద్ర ॥ (స్వ) ప్రయోగించినంతనే సకలలోకముల దహింపఁజాలు నిమ్మహాస్త్రమొక్క కోతినిచంపఁజాలక యూరకకట్టివేసి యున్నదికదా? అహా! ఇతఁడెవ్వఁడో మహానుభావుఁడు కానోపు. లేకున్న నేనుప్రయోగించిన బాణముల నించు కంతయు వశివాళువాడక యున్నాఁడే? నేనేయమ్మహాస్త్రముమును చక్కఁగా ప్రయోగింపనైతినికాఁబోలు? నేనిప్పుడే వీనిని గొనిపోయి పుత్రశోకముననున్న మాతండ్రిని నూరడించెద. (ప్ర) రాక్షసులారా! యీకోతిని చక్కఁగ బంధించి తీసికొనిరండు.

(నిష్క్రమము)

ఆంజ ॥ (అనుబంధము 32)

(పాడుచు నిష్క్రమము)

(యవనికపడును)





# విభీషణపట్టాభిషేక నాటకము.

పంచమాంకము—ప్రథమరంగము.

రావణునాస్థానము.

[రావణుఁడు, విభీషణుఁడు, మంత్రులు మొదలగువారుందురు.]

రావణ॥ మంత్రిసత్తములారా! ప్రహస్తాదులారా! ఆ నారాయణునెదిరింపఁబోయినప్పుడైన నించుకంతయుఁ జింతింపనైతిని. యమపురమాక్రమించి యాపరేతనాయకున కధికారము తప్పించి పాపాత్ములనందరిని రౌరవాది నరకములనుండి విడిపించునప్పుడైన చింతింపనైతిని. ఇంద్రలోకమును ముట్టడించి యింద్రుని చెరపట్టునప్పుడైన చింతింపనైతినిగాని యిప్పుడొకకోతికై చింతింపవలసివచ్చెఁగదా?

సీ॥ ఇంద్రలోకముఁజొచ్చి యింద్రుని చెఱఁబట్ట
నెంచినవేళ యోచింపనైతి।
సమయజీవులనెల్ల సమయించుయముఁబట్ట
నెనసినవేళ యోచింపనైతి।
చండభానునిఁబట్టి గండడంచెడివేళ
నింతైనమదిని యోచింపనైతి।
ధరకుబేరుని వరపుష్పకముఁగొంచు
నెసగెడివేళ యోచింపనైతి।

గీ॥ యెనసికైలాస మెత్తయోచింపనైతి।
యెలమిమాంధాతనణప యోచింపనైతి।
యిప్పుడొకబక్కకోతికై యింతచింత।
చేయవలసెనునక్కటా సిగ్గుచేటు।

ఇంతటిసిగ్గుచేటుకలుగునే?

ప్రహ స్త॥ దేవా! ఇదియెక్కడికోతి? మనమెన్నడును కోతులను చూడలేదా? వీఁడెవ్వఁడో మాయావి కానోపు. నాకుఁజూడ నిట్టిమాయలకెల్ల నావిష్ణువే కారణమని తోఁచుచున్నది. దొంగతనమునకు మాహారికిసుగ్గు తోఁబుట్టినదికదా? ఐనను మనము చింతింపవలసినపనిలేదు. మన యింద్రజిత్తు యువరాజుగారు ఇట్టి నారాయణునివంటి మాయావుల పదివేవురసృజింపఁజాలుదురు. ఇంకొకక్షణముననే మనకాసంతోషవృత్తాంతము తెలియఁగలదు.

అకంపన॥ తెలియఁగలదననేల? తెలిసియేయున్నది. దైత్యేంద్రా! మీరు చింతించిన నీపదునాల్గు లోకంబులు నిలువఁగలవే? ఆ కోతి విష్ణువేకానిమ్ము. నీదాసునకు నాకాజ్ఞయిమ్ము. ఆ దొంగను సముద్రము దాటువఱకు పరువెత్తించెదను.

విభీష॥ రాక్షసవీరులారా! ఈవృథాగర్వము పనికివచ్చునా? తన్ను, నెదిరిని, చూచి మాట్లాడవలయు. ఇప్పటికావిషయములు చేక్షింపరాదు. అన్నిటికిని రామునితోడి పగచాలించిన మేలనితోఁచుచున్నది. అన్నా! దగ్గర కొండెములు చెప్పుచు నీదుర్యోధములు బోధించు నీ దుష్టచతుష్టయము మాటల వినకుము. ఆ సీతాసతి మనయూరుచేరిన మొదలు మనకనిష్టమే సంభవించుచున్నది. కావున మొదట నామెను పురివెడలింపుము.

(లోపల రాక్షసులధ్వని)

రావణ॥ తాళుఁడు! తాళుఁడందేమో శబ్దమగుచున్నది.

(ప్ర॥ ఇంద్రజిత్తు, ఆంజనేయునితో)

ఇంద్ర॥ తండ్రీ! ఇదేకొనివచ్చియున్నా నాదుష్టవానరమును. వీనికి వలసిన శిక్ష విధింపుము.

రావణ॥ భళిరే పుత్రకా! నీవుకదా సుపుత్త్రుఁడవు. సంతోషించితిని.

ఆంజ॥ (జనాంతికముగా) తండ్రికి తగిన పుత్రుఁడు. పుత్రునికి తగిన తండ్రి. బాగుగానున్నది.

ప్రహస్త॥ ఓరీ! వానరాధమా! ఏమి దయ్యమువలె నిలిచితివి? నీకు మర్యాద తెలియదా? సకలలోకములకు ప్రభువైన రావణచక్రవర్తికి నమస్కరింపుము. అప్పుడు నీపై కరుణ కలిగినను కలుగవచ్చును.

ఆంజ॥ సర్వలోకములకు ప్రభువగు మా ప్రభువుకుఁదప్ప నిట్టి తుచ్ఛదానవులకు నమస్కరింతునా?

రావణ॥ ఓరీ! వెఱ్ఱికోతీ! నాకంటె ప్రభుఁడెవఁడురా? ప్రభువును నేనే. దేవుఁడు నేనే. దేవదేవుఁడును నేనే.

ఆంజ॥ నీవా ప్రభువు? నీవా ప్రభునామమునకుఁదగినవాడవు? దోపుడు దొంగవు. కఠినుఁడవు. పాపుఁడవు. ప్రజలను పాలించువాఁడుకదా ప్రభువు? బాధించువాడుప్రభువగునా! నీకేల ప్రభుపదము?

సీ॥ ధర్మాత్ములగువారి దాగిహింసలఁబెట్టి
పడరానిబాధల పఱుపలేదే।
పరమపతివ్రతా తరుణులచెఱఁబట్టి
నిరతపాతకివౌచు చెఱుపలేదె।
అన్న, తమ్ముడు, తండ్రి, యనక బల్మినిఁబట్టి
యిలలేనిపాపముల్ సలుపలేదె।
జపతపంబులుచేయు సాధులఖండించి
వారిరక్తముఁద్రావఁ బంపలేదె।

॥ యెల్లజగములహింసించి యేగుపరచి।
నొంచి, వంచించి, గారించి, సంచరించు।
రాక్షసమ్మృగంబ! నీవొక్క రాజవగుదె।
పాపకర్ముండనీకేల ప్రభుపదంబు॥

ఇంద్ర ॥ ఓరీ! ఎవ్వఁడు హరునికైలాసము పుట్టచెండుబోలె నాడించెనో, ఎవ్వాఁడుసకల దేవదైత్యుల నిజప్రతాపాగ్నికి నింధనములుగా నొనర్చెనో, ఎవ్వని యపాంగావలోకము నొందుటకు శతానందపురందరాదులనవరతము వేకరుచుందురో, ఎవ్వాని సత్కీర్తినిరత దిశాంగనాశిరోభూషణమై వెలుగొందునో, అట్టివానికి నమస్కరింపఁ గలుగుటనీపూర్వార్జిత సుకృతమనుకొమ్ము.

ఇంద్ర ॥ సీ॥ కైలాసమగలించి కామారిమెప్పించి
వెలుగొందు త్రైలోక్య వీరుఁడితఁడే।

ఆంజ ॥ వాలితోఁ గకుఁజిక్కి వారిధిముంచంగ
చచ్చినట్టులపడ జారెనితఁడె॥

ఇంద్ర ॥ ఇంద్రలోకముఁజొచ్చి యింద్రునిచెరబట్టి
సరిలేక రాజిల్లు ప్రభుఁడితండె।

ఆంజ ॥ కార్తవీర్యార్జును కారాగృహమునందు
వెయ్యేండ్లుపడియున్న వీరుఁడితఁడె।

ఇంద్ర ॥ యమునితానోడించి యమితపాపులనెల్ల
దయచేతవిడిపించు దాతయితఁడె॥

ఆంజ ॥ శ్వేతదీవికిఁబోయి చెలువలచేఁజిక్కి
సిగ్గుచేటుగనిల్లుఁ జేరెనితఁడె।

ఇంద్ర ॥ సూర్యచంద్రులఁబట్టి సురిక్కణగించితా
ప్రఖ్యాతిఁగన్నట్టి రాజితండె।

ఆంజ ॥ మాంధాతచేఁజిక్కి మాంపాహియనివేడి
దీనుడై పడియున్న దేవుఁడితఁడె।

ఇంద్ర ॥ గీ॥ దేవదేవుండురాక్షస దేవుఁడితఁడె।
ఆంజ ॥ దుష్టకర్ముండుచోరుండు ద్రోహియితఁడె।
ఇంద్ర ॥ శరణువేఁడుముమారాజు చరణములను।
ఆంజ ॥ యిట్టిపందెలకెందైన నెఱఁగగలనె॥

రావణ ॥ ఓరీ! చెనటికోతీ? నాయెదుట నింతగర్వించి మాట్లాడిన నీకు యమపురము సమీపించుచున్నది. అయినను నా ప్రశ్నలకు ప్రత్యుత్తరమిమ్ము. నీవెవఁడవు? నిన్నెవరంపిరి? ఎందుకై వచ్చితివి?

(అనుబంధము 34. లోనిపల్లవి)

ఆంజ ॥ ఔరా! వీఁడు సింహాసనమున కూర్చుండి మాటలాడువాఁడు? నేను క్రిందనిలిచి మాటలాడువాఁడనా? అట్లైన మా శ్రీరామచంద్రునికి గౌరవమొనర్చినట్లగును. కావున నా వాలమును పెంచి సింహాసనముగా నొనర్చి కూర్చొని మాటలాడెదను.

(తోకను పెంచి సింహాసనముగా నొనర్చుకొని దానిపై కూరుచుండును.)

(అనుబంధము 34)

ఆంజ ॥ ఓరీ! రావణా! కోదండముపట్టినవారికెల్ల నాచార్యుఁడై, నినుఁబోలు దుష్టుల శిక్షించి, శిష్టుల రక్షించుటకై జనించినవాఁడై, మీ మామ మారీచునిపాలిటి యముఁడై, ఖరదూషణాదులకు మృత్యుదేవతయై, వాలియంతటివాని నొక్కబాణమున కూలనేసినవాఁడై, యిప్పుడు కిష్కింధయందు నిన్నాహుతి గొనుటకై యెదురుచూచుచున్న శ్రీరామప్రభుని ముఖ్యబంటును. ఆంజనేయుఁడనువాఁడను. ఆవాలి యెవ్వరో మఱచితివా? నిన్ను తోకకు చుట్టి సప్త సముద్రముల ముంచి కరుణించి బ్రతుకుపొమ్మని విడిచెనే యతఁడు. జ్ఞాపకమున్నదా? ఆరాముని దేవేరియగు సీతాదేవిని నతడు లేని సమయమునఁ గొనితెచ్చితివి. ఇట్టి దొంగతనము జేసినందులకై నిన్నొక్క శరముకొనములికిచే తుత్తునియలుచేసి కాకులకు బలియివ్వవలసియున్నను, దయతలఁచి నీకు బుద్ధి చెప్పుటకై నన్నంపియున్నాఁడు.

పాపాత్మా! ఊరక చెడకుము. ఇప్పుడే మా జానకీదేవిని కానుకలతో కూడ శ్రీరాముపాదములకర్పించి త్రాహియని శరణొందుము. కాపాడును. ఇంకెవ్వరును నిన్నుఁగాపాడు వారు లేరు, కారు, రారు. ఊరక నీయాలుబిడ్డల నోట మన్నుకొట్టకుము. బుద్ధి తెచ్చుకొనుము. నీకు బుద్ధిగలఉ పుటకయ్యే యింద్రజిత్తు బ్రహ్మాస్త్రమునకు చిక్కితినికాని వేరుకాదు. వాలి తమ్ముఁడు సుగ్రీవుఁడు డెబ్బదివేల సైన్యముతో నీప్రాణములకై వేచియున్నాఁడు. లెమ్ము. ఆ దేవిని వేఁడుకొని రామునివద్దకు ప్రయాణమునకు సిద్ధముకమ్ము.

రావణ ॥ వానరాధమా! పలుకకుము. నోరుమూయుము. ఒక మానవుని బంటువై, చెట్లయందు కాయకసురు తినియుండక మా నగరినేల చొచ్చితివి. చొచ్చితివిబో వనమేలచెఱచితివి? చెరచితివిబో మా రక్కసునేల సంహరించితివి? ఓరీ! ఆ కోతులతో రాముఁడు రాఁగలఁడా? ఒక్క మా కుంభకర్ణునకు మిమ్మందఱి నాహారముగా నొనర్చెదము రండు. ఆ రాముని వేగరమ్మనుము. సీతను మఱచిపొమ్మనుము. రావణచక్రవర్తికి దాసురాలై క్షమాపణము వేఁడిన సీతను విడుచునని చెప్పుము. పొమ్ము. ప్రేలితివేని దక్కవు. మీ వానరులలో నీయట్టి పందలేనా యుండునది?

ఆంజ ॥ వారిలో నేనొక్కరుఁడనే మిక్కిలి చేతగానివాఁడను. అందునకే వారీలాటి పనులకు నన్నంపుచుందురు.

ప్రహస్త ॥ (స్వ) వీఁడే మాలంక నల్లకల్లోలము చేసెనే? ఇంక ఆ కోతులన్నియు వచ్చిననేమిగతి?

ఆంజ ॥ రావణా! నామాటల నిపుడేల విందువు? శ్రీరాముని కోపాగ్ని లంకను కాల్చునపుడు, వానరులు నిన్ను చుట్టుముట్టినపుడు, శ్రీరామచంద్రుని బాణము నీ రొమ్మున నాటి వీపున దూసిపోవునపుడు, నీ పుత్రమిత్రకళత్రాదులు దిక్కు

లేక మడసి శవములపై కాకులు ముసురుకొనునప్పుడైన నెఱుఁగవా? ద్రోహీ! చోరుఁడవు. నీకు మనుగడ కలదే? ఇఁక నీవు చచ్చినవాఁడవే యనుకొమ్ము. నిన్ను, నీలంకను, నీ రాక్షసులను తోకకుచుట్టి సముద్రమున ముంచుచుంటిని గాని మా రామునియాజ్ఞలేనికతమున మానితి. బ్రదికితివి. అధమా! నీకు మరణకాలమాసన్నమైనది.

రాసణ॥ దురాత్మా! చచ్చితీవింకేల మాట్లాడెదవు?

(అనుబంధము) 35.

రావణ॥ ఓరీ! వానరాధమా! అగ్నినైన నార్పవచ్చుగాక రావణు నెదుర్కొందువే? ప్రతిపంథివర్గంబుల నుక్కడించు కాలయమునియెదుట నిలువఁజాలుదువే? సురాసురులు నా రూక్షవీక్షణములఁగాంచిననదియే ప్రళయమని భావింతురు. నీవు నాయెదుట నిలిచి మాట్లాడుట నా సంపూర్ణ క్షమాపణమువలనగాని వేరుకాదు. లోకజాలంబుల పుట్టచెండుఁబోలె నాయిచ్చకు వచ్చినట్లు చేయఁగల దైవమే నేను. జగమునంతయు లయకాలమున నా కోపాగ్ని దహించుచుండుటచేతనే నేకాలరుద్రుఁడనగుదును. మీరాముఁడు పంపెననిగదా జంకులేక వచించితివి? ఆతుచ్ఛమానవునకు కావరము హెచ్చెఁగాఁబోలు? వానితో చెప్పుము రావణుఁడు నీకు మిక్కిలి యసాధ్యుఁడని. ఈ మాటలాడ నిన్నంపినందులకు క్షమింప వేఁడుకొమ్మనుము.
దైత్యులారా! వీనినిప్పుడే నాయెదుట సంహరింపుఁడు.

(రాక్షసులందఱు వానిపైకి పోవుదురు.)

విభీషణ॥ అన్నా! నీవంటివారు కోపమునకు లోనగుదురే? నీవు సురాసురులలో మహా ధర్మజ్ఞుఁడవు. నీకు నేను చెప్పువాఁడనా? అన్నా! ధర్మశాస్త్రములయందు దూతను వధింప కూడదనికదా చెప్పఁబడియున్నది? వీఁడు మంచిది చెప్పుట

కును చెడ్డదిచెప్పుటకును శక్తుఁడా? దూతలు తమప్రభువులు చెప్పిన మాటలఁజెప్పుదురు. అందు వారి తప్పేమున్నది? వేసినవాడుండ బాణమును నిందించువారుందురే? దూతలను చంపుట మహాపాతకము. దూతలు తప్పుచేసినపుడు కొన్ని శిక్షలుండకపోలేదు. ఏమన్న ముఖ్యమగు నంగమున కేదైన గుర్తుచేయుట, లేక కశాఘాత మొనర్చుట. ఈ రెంటిలో నేదైన నొనర్పుము. ఇది ధర్మమగును.

రావణ ॥ విభీషణా! సత్యము. నీవాక్యములు ధర్మసమ్మతములు. నేపొరబడియుంటిని. నీవు చెప్పినచొప్పున నే చేసెదను. వానరులకు ముఖ్యాంగము వాలముకదా? కావున వీని వాలము కాల్చి పంపెదను. అప్పుడైనను వీనికి బుద్ధి రాగలదు. దైత్యులారా! వీని వాలమునకు వస్త్రములచుట్టి తైలమున తడిపి దహింపుఁడు. పొండు వీనిని గైకొని.

(రాక్షసులాంజనేయునితో నిష్క్రమణము.)

విభీషణ ॥ అన్నా! రాజేంద్రా! సభాసదులారా! నా విన్నపమాలకింపవలయు. ఇపుడీవానరము మనపురిఁజొచ్చినదియే మనకు చెడుగునకు మూలమని తోచుచున్నది. పూర్వము నీవు కైలాసగిరి కేగి పరమేశ్వరుని దర్శించి వచ్చునపుడు నందీశ్వరుఁడు శాపమిడియెఁగదా? దానిని మనమాలోచింపవలసియున్నది. మరియు, మనము చేయు కార్యము సత్కార్యమా, దుష్కార్యమాయని యాలోచింపవలయు. మనమొనర్చిన సీతాపహరణ కార్యమందమా సర్వలోకదూషణీయ్యము. అనంతపాపప్రదము. ఇంక మనవిరోధినింత విచారింతము. అతఁడన్ననో అనన్య సాధ్యమగు హరుని విలు నొక్క తృణముఁబోలె నవలీల విరచినవాఁడు. ఖరదూషణాదుల వేల్మిడి చక్కాడిన వీరశేఖరుఁడు. లోకైక శూరుఁడగు వాలి నొక్క బాణమునఁ గూలవేసిన

కోదండ దీక్షాగురుఁడు. అట్టివానితో మనము సంగ్రామమునకుఁ బూనుకొనుట మిక్కిలి యసమంజసము. కావున నా రాఘవునకు సీతనర్పించి సంధిచేసుకొనుటయే తొలుత చేయఁదగిన కార్యము. ఈ యాంజనేయుఁడు పావకమును ప్రేయీకార్యమొనర్చిన మన లంకకును రాక్షసకులమునకును మేలొనరించినవారమగుదుము.

రావణ ॥ విభీషణా! ఏమి. పిరికిమాటలాడుచున్నావు? నేనాసీత నర్పింపను? కావలయునన్నవాఁడె నన్ను శరణుజొచ్చి తన జానకినిమ్మని వేఁడుకొనిన నవశ్యమిచ్చెదను. పట్టినపట్టు విడుచుటన్న నెట్టిది? నా కీర్తిని నీటగలిపి, శౌర్యము నావల పారఁదోలి, యొక్క మనుజ వీరునకై యెంతయో భయపడి సంధి చేసుకొనవలయునా? సంవర్తకాల మార్తాండ బింబమెన్నఁదగిన తన వేఁడిమి వీడఁగలదే? ఎంత బలవంతుఁడైనను రాముఁడొక్కఁడేకదా యుండునది? తక్కినవారు కోఁతులు.

విభీషణ ॥ అగ్రజా! రాముఁడొకఁడేయని తలంపకుము. అగ్నికణమొక్కటైనను ఘోర కాననంబుల నన్నిటిని దహింపదా? ఖరదూషణాదులు పదునాల్గువేలవారి ఖండించెను గదా? రాముఁడొక్కఁడేనా లేక యిద్దరు రాములుండిరా?

సీ॥ తపసియాగమునాఁడు తాటకేయునిఁజంపె
ఘనశక్తి రాముడొక్కరుఁడుగాఁడె।
సరిలేకతిరుగాడు ఖరదూషణాదుల
శరవహ్నిఁగూల్చె నొక్కరుఁడుగాఁడె।
నినువార్ధిముంచిన ఘనువాలినొకకూల
నరుదారగూల్చె నొక్కరుఁడుగాఁడె।
అలవిరాధుకబంధు నలయించి వధియించె
నరుదారువీరుఁ డొక్కరుఁడుగాఁడె।

గీ॥ పరగమనసమామ మారీచుమదమణంచె।
కడిదివిలుకాఁడు రాముఁడొక్కరుఁడుగాదె।
హాషికోదండ దీక్షాగురుండు జగతి।
రామునింబోన నెఱుఁగవో రాక్షసేంద్ర॥

రావణ॥ వాఁడు శూరుఁడే కానిమ్ము. సరివారిలో తలవంపులుగా నీ రావణచక్రవర్తిని వానితో సంధిచేసుకొనుమని చెప్పితివా? నీకు బుద్ధిచాలదు. సకల శత్రుస్తోమంబుల నిజకాండాసన కాండముల నుక్కడించి కసిమసగి చెలరేగియున్న యీ రావణసార్వభౌముఁడొక్క మానవపశునకమునకు లొంగి మెలఁగుటకంటె నష్ట ప్రాణంబుల విడచుటయే మేలుకదా?

విభీషణ॥ నేను యుద్ధము వలదంటినా? లోకగర్హితపాపదవానలమునకు మూలమగు పరదారపరిగ్రహము వలదని చెప్పితినా? యోచింపుము.

రావణ॥ సీతనివ్వను. వానిని విడువను. నీవు కావలసియున్న పొమ్ము వాని పాద శేవఁజేయుటకు. నీకేల యీ యధికప్రసంగము? చేతగాని పందవు. నీకేమి తెలియును యుద్ధక్రమము? మూయుము నోరింక. నీవవివేకివి.

విభీషణ॥ నేను చేతగానివాఁడనేయగుదునుగాక. నీకు కాలమాసన్నమైనది. లంక చెడుకాలము వచ్చినది. ఇప్పుడేల నా మాట విందువు? నేనవివేకినో పరదారాపహరణమొనర్చిన నీవవివేకివో? దేవుఁడెఱుంగు. కులనాశకుఁడవు. మా వంశమున తప్పి పుట్టితివి. నిన్ను శేవించుటకంటె నారామచంద్రుని శేవించిన నాకైహికాముష్మిక ఫలములిచ్చును.

రావణ॥ భ్రాతృద్రోహీ! కండకావరమున కారులు పలికెదవా? పొమ్ము నావద్దనుండి. లేకున్న నిన్నుచంపి మా కులమును నిర్దోషముగాఁజేసెదను.

(కాలితో తన్నును.)

(అనుబంధము 36)

విభీషణ॥ దుర్మార్గ రావణా! నీవింక చెడితివి. సభాసదులారా! కంటిరే వీని దుడుకుతనము. వీని వామపాదము శ్రీరామ చంద్రుని బాణముల తెగి స్మశానమున దొరలాడు వేళకదా దానిఫలము తెలియగలదు! పాపాత్మా! నన్నుతన్నితివా! నీ జీవితమును తన్నినట్లే యనుకొమ్ము. రామబాణముల నీ రాక్షస రక్తము ప్రవహించునపుడు, నీ దశశిరంబుల ఖండిం పఁబడి భూమిపై బడియుండ గ్రద్దలు కాళ్ళతో తన్నునపుడు నన్నుతలఁచెదవుగాక. నీయట్టి పాపివద్ద నేనుండనోప. ఇదే నేనారాముని శరణొంద నేగెద.

(నిష్క్రమము)

యవనికపడును.



# విభీషణ పట్టాభిషేక నాటకము.

పంచమాంకము—ద్వితీయరంగము.

అశోకవనము.

(సీతా, త్రిజట కూర్చొనియుందురు.)

సీత ॥ అకటా! మహాబలసాహసుఁడు, శ్రీరామ క్షేమవార్తల వినిపించి, మెఱపు మెఱపించిన తెఱంగున నాకు అల్పకాల సంతోషమొసంగి, వెడలి చనియె. రామభద్రుఁడిటకు వచ్చుటెట్లో? వచ్చినన్గాంచుటెట్లో? గాంచి, రావణాది పరిపంథుల పరిమార్చుటెట్లో? తెలియకున్నది. నాకీజన్మమున శ్రీరామపద సరోజసేవాభాగ్యము కలుగునో కలుగదో తెలియదు.

త్రిజట ॥ అమ్మా! భవాద్రుశ ధీర పతివ్రతాశిరోమణులు వగల పొగులనగునే. నేఁడు కష్టమనుభవించినదానవు మరునాఁడు సుఖపరంపరల నోలలాఁడుదువు. ప్రపంచవంచకులై పర దారపరధనాపేక్షకులయిన దురాత్ములు కలకాలము భూమి మనుదురే? యోచింపకుము.

సీ॥ నినుఁజూడకున్నను నీమహాతేజంబె
సతతసాక్ష్యంబు చాటునమ్మ!

ఇమ్మహినీకిట్టి యున్నలున్నునదెచ్చె
కటకటా ! విధియెంత కఠినుఁడమ్మ ।
త్రైలోక్యనాథుఁడౌ రామునిపత్నివై
బలువెతకుందంగ వలసెనమ్మ ।
కలకంఠి ! నేమంచి కలఁగంటినీకింక
కల్యాణములుచాల కలుగునమ్మ ॥

గీ॥ లలననీవింక చెరనుండి తొలఁగెదమ్మ ।
చెలువశ్రీరాము సన్నిధిచేరెదమ్మ ।
మహితచారిత్రశోకంబు మానుమమ్మ ।
కరుణనామీద నెప్పుడు మరువకమ్మ ॥

సీ॥ రావణుండొకఁడిందు రహిఁపుట్టుటనుచేసి
చెలువారునీలంక చెడఁగవలసె ।
భామ ! నిందెచ్చుట బ్రహ్మవంశంబింత
పడరానియపకీర్తి పడఁగవలసె ।
సరిలేకతనరారు సకలరాక్షసరాజ్య
మవనినిర్నామమై యరుగవలసె ।
ధరణిననాథలై దైత్యభామామణుల్
ఘనదుఃఖమునభూమి మనఁగవలసె ।

గీ॥ కలికియింటింటరోదనల్ కలుగవలసె ।
ఇహపరంబులరెంటిని నీగవలసె ।
బంధువులచేతతిట్లుఁ బడగవలసె ।
ఏలచెప్పంగమాకింక నేడరునెనసె ॥

సీత ॥ అమ్మా! విషబిందువులందు అమృతరసంబు కలిగినట్లు నీరక్కసులలో నీవొక్కతెవు నాకు పరమసమ్మోదకర వాక్యంబుల నుడువుచున్నదానవు. తల్లిరో! నీవాక్య సందోహంబులనుపమాన మామకతాపాంధకార సహస్రభానువులై, మదీయ్యధైర్యలతావలంబన మహావేణువులై, నన్నపారసుఖపారావారంబున ముంచె.

త్రిజట ॥ జాన దేవీ! నేనువిభీషణపుత్రికను. త్రిజటయనుదానను. నిచేసర్వానర్థములీలంకకుకలుగునని మాతండ్రి విభీషణుఁడు యెంత వ్రాకుచ్చినను, యెంత బోధించినను, వినక రావణాసురుఁడు కోపించి ధిక్కరించి అవాచ్యదూషణ భాషణములాడి యతని నీపురి వెడల తరిమెను. మా తండ్రియు శ్రీరామచంద్రుని యాశ్రయించుటకై చని యున్నాఁడు. నీకంక సర్వశుభములు కలుగును. దీనినంతయు నేను కలఁగనియున్నాను.

సీత ॥ (సంతసించి) అమ్మా! యిప్పుడు నేను కృతార్థనైతిని. దుఃఖ లేసిదానికి నీవొకదిక్కై పాలింపకలిగితివి.

(ప్రవేశము ఉష్ట్రముఖి, అజాముఖి, మొదలగువారు.)

అజా ॥ సీతా! నీతో మొన్న నేమేమో మాట్లాడి అశోకవనమును ధ్వంసమొనర్చిన యా దుష్టవానరమునకయిన శిక్ష తెలియునా? తోకకు నగ్నితగలించి వానినిదండించుచున్నారు. మేమావింతను చూచివచ్చెదము. నీవిందేయుండుము.

(అని నిష్క్రమము)

సీత ॥ ఆహా! పాపపువిధి! నిన్నెంతదూరిననూ తీరదుగదా! సముంచిత రామచంద్రక్షేమవార్తా శ్రవణంబున నెంతయు సంతసిల్లియున్న నాకు నీయాంజనేయవాల దహనవార్తా శ్రవణమువికచకమలవనమున చంద్రికా ప్రసరముంబోలె నతిశయ శోకమహానలమున ముంచెగదా? ఏమిసేయుదు. మారుతికటకట రక్కసులకు జిక్కెననా నేల నీతని బంధించిరి? రావణుండేల వాల దహనమొనర్పుడని కట్టడ యాజ్ఞ యిడెను? యిదియంతయు మదీయ పూర్వకృత పాపఫలము గదా! మందభాగ్యులకు సహాయులగువారు సహితము మందభాగ్యులగుట నాకిపుడు తెలిసె! ఈ దుర్విధి యెన్నాళ్లు నన్ను గారించునోగదా? యింకేమిగతి? ఈ వాయునందనుని కాపాడువారెవరు? హవ్యవాహనా! సకలలోక రక్షణా ధురీణా! స్వాహామనోనాయకా, నేను నిశ్చలపతివ్రతామణి యగుదునేని, సత్యావస్థల సర్వకాలముల మనోవాక్కాయ కర్మల శ్రీరాముని యేకపరదైవముగా నెంతునేని, యిట్టిసంకట దశయందునూ నామానస సరోజాతపీఠమున రామభద్రు నిడి యనిశంబు పూజింతునేని, శ్రీరామ సామ్రాజ్యపరిపాలనంబు విధాతృసృష్టంబేని రావణకుంభకర్ణాది దుష్టనిధనంబు సకల దేవవర్గమానస సమ్మతంబేని మా యాంజనేయుని, మా రామ దూతవరేణ్యుని, శ్రీరామభక్తసన్మాన్యుని, చందనశీతులుండవై కాపాడుము. సర్వాదిశలు త్రిమూర్తులు వేదనిచయంబులు ఋషిగణంబులు మాయాంజనేయునికాపాడుదురుగాక.

(ప్రత్యక్షమున నొకశబ్దము కలుగును. దానినుండి తేజస్సుదయించి దానియందగ్నిపురుషుండు జనించును).

అగ్ని సకలలోకమాతా! నీవింతనను వేడుకొనవలయునా! చరాచరలోకములు నీస్వరూపములుకావా? ఓంకారపంజర శుకివై, వేదాంతారామకలకంఠివై, శక్తిత్రయస్వరూపిణివై యీరావణాదుల పాలియించుటకు భూమిపై జనియించిన మాయాశక్తివికావా నీవు. నియాశీర్వచన రక్షణముననే వాయునందనుఁడు పరమానందభరితుఁడై యుండగలఁడు. నీవేమియు యోచింపకుము. భవత్కరుణాపాంగ కవచాచ్ఛాదితుఁడయిన యాంజనేయుఁడు వాలమున లంకనంతయు దహించి శ్రీరామపాదసన్నధి త్వరలో చేరఁగలఁడు. నేను వాలాగ్రమున మణిప్రాయుఁడనై యుండి యతనికించుకంతయు తాపము కలుగనివ్వక కాపాడెదను. తల్లీ! సమ్మోదము వహింపుము.

సీత॥ వైశ్వానరా! నీకరుణామహిమచే నేను కృతార్థనైతిని. నీదర్శనమబ్బుటచే కృతార్థనైతిని. దేవా! శ్రీరామపాద సందర్శనము నాకు లభించుగదా?

అగ్ని॥ అమ్మరో? యేకొంతయు యుండదు. సర్వశుభములు గలుగు. నేనింకతడయరాదు. పోయివచ్చెద.

(నిష్క్రమము)

(యవనికపడును.)



# విభీషణపట్టాభిషేక నాటకము.

## పంచమాంకము—తృతీయరంగము.

### లంకాపురివీధి.

(ప్రవేశము: రాక్షసులాంజనేయునితో)

1 రాక్షస॥ ఓరీ! వానరా! ఇఁక నీపని తీరినది.

ఆంజ॥ నాదొక్కటియేకాదు. మీలంకపనిసహితము తీరినది.

2 రాక్షస॥ మా రావణునకు మ్రొక్కి వేఁడుకొని యున్నయెడల నీకింతటి కష్టముండియుండదుకదా?

ఆంజ॥ అట్లయిన నాపని యెట్లు ముగియుచుండెను?

3 రాక్షస॥ ఇంకను నీక్రొవ్వణగలేదా?

ఆంజ॥ మీయందఱి క్రొవ్వణగించినపిదప తనంతకు తానే యణఁగగలదు.

4 రాక్షస॥ వీనితో మాటలేల? తగిలింపుడగ్నిని. వీనికి నూరేండ్లు నిండినవి.

ఆంజ॥ కానిండు నాకు నిండినవో మీకు నిండినవో తెలియఁ గలదు.

(రాక్షసులందఱు అట్టహాసముతో తోకకగ్నిని తగిలించి కరతాళధ్వనులు చేతురు.)

అందఱు॥ ఓరీ! కోఁతీ! పొమ్మిఁక నీయిష్టమువచ్చినట్లు. అయిన తోక పూర్తిగా కాలువఱకు నీ కట్లూడఁజాలవు.

ఆంజ॥ అవి యూడకున్నను మానెఁగాక మీ ప్రాణములూడకుండునట్లు కాపాడుకొనుఁడు. (అని శరీరము విదలింప అందఱు క్రింద పడుదురు.) ఆహా! ఏమాశ్చర్యమిది? అంటినవానినట్టె దగ్ధమొనరించు యీ హుతాశనుఁడుసైతము సుగంధచందనముఁబోలె శీతలుఁడై నాకెంతయు నానందముఁగలిఁగించుచున్నాఁడు! ఇట్లుండునా? నేను రామకార్యార్థమై యెంతయో పరిశ్రమించుచున్నందున దేవతలేమైన నాకగ్నిభయము లేకుండ వరమిచ్చియుందురా! లేక అగ్నిదేవుఁడు మాతండ్రికి పరమమిత్రుఁడైనందున సతనిపైఁగల పరమాదరణమున నన్ను దహింపక మానియుండునా? ఇవియన్నియు నట్లుండ నాపరమసాధ్వీమణియగు సీతామహాజనని యాశీర్వాదబలమున నాకీయగ్ని బాధయించుకైనను కలుగకుండ యుండునా? ఓ మహాజననీ! నీ కరుణామహిమ మత్యద్భుతము. నా వాలాగ్రమునను న్నయగ్నిదేవునకు లంకపైనను కరుణకలుగునేమో చూచెదఁగాక. ఇప్పుడే యీలంకానగరమునంతయు దహించెద. ఇదియే నేను లంకఁజొచ్చినందుకు గుర్తుగానుండఁగలదు. (అని పురమునందంతటను అగ్నినిడును.) ఇఁక నాకార్యము సమాప్తినొందెను. శ్రీరాము సన్నిధానము నొందెదను. (రాక్షసులు వీధివీధినిరోదనము చేయుచు పరుగెత్తుదురు. ఇండ్లు కూలుచుండును.)

(అనుబంధము 37)

(ఆంజనేయుఁడాకాశగమనమున నిష్క్రమించును.)

(యవనికపడును)



# విభీషణ పట్టాభిషేక నాటకము.

పంచమాంకము — చతుర్థరంగము.

మాల్యవంతము.

(శ్రీరాముఁడుండును)

రామ॥ అకటా! దాదాపుగ నొక్కసంవత్సరమాయె నాజీవితేశ్వరినివీడిచి. ఆయాంజనేయాదికపులు జానకినిఁగాంచిరో కాంచరైరో. కాంచి చిత్రప్రతిబింబిత రాక్షసరూపముల కొక్కింత భీతినొందునా భీతహరిణేక్షణ ఘోరరాక్షస భయంకరాకారములఁగాంచి యట్టియసువుల విడిచియున్నందున నావృత్తాంతము నాకెఱిఁగింపనోడి యెందైన తమ జీవితములఁబాసిరో తెలియకున్నదిగదా?

మ॥ తలపన్ వానరులెందు నేగిరొకొ? సీతన్ గాంచిరో కానరో?
జలజాతేక్షణ కానలేమియసువుల్ చాలించిరో? స్రుక్కిరో?
కలకాలంబిటు శోకవార్ధి కడువంగానౌనొ కానేరదో?
కలనైనన్ సతిఁగాంతునో? కననొయింకన్ ప్రాప్తియెట్లున్నదో॥

అనవరతము సఖీజనసంభాషణముల నెంతో విసుకుఁజెందు నారామామణి భీకర రావణదారుణాలాపముల నెట్లాకర్ణించియుండును? చిలుకలు పలికిన పునరుక్తమ్మని యొకనిమిషమైనను తాళలేని యా కోకిలవాణి భయదరాక్షసకోప ఘర్జనంబులకెట్లు తాళియుండును? చెలువార నాదండనున్నను నాగిరికందరములఁగాంచినంతనే యట్టె కన్నులు మూయు నాయరవిందేక్షణ నానాసరిత్సముద్రగహ్వారంబుల

నెట్లు వసియించియుండును? కట్టా! తలచుకొన్న శత్రుల కైనఁజాలికల్గదే? పాపిదైవమా! తండ్రిని నాకు లేకుండఁ జేసితివి. కన్నతల్లులదండనుండి విడఁదీసితివి. సోదరుల సహకారసల్లాప సౌఖ్యము లేకుండఁ జేసితివి. బంధువర్గములనంతయు దూరీకరింపఁ జేసితివి. ఉన్నపురికుండ రాములు కలిగించితివి. సకలరాజ్యసుఖముల నొందలేమి ఘటించితివి. సమంచితవీరవర్గసంస్తవనీయ్య దివ్యకవచంబు ధరించుమేన దుస్సహమగు బూదినలదఁ జేసితివి. విలువగల పట్టుఁదుకూలాంబరముల ధరించు కటిసీమకఠినతర నారచీరలఁగట్టించితివి. రసరసాన్న పక్వాన్నములఁ బారవైచు నోటికి కందమూలఫ్ముల నోఁటంబుఁగావించితివి. అంతట తృప్తినొందక యెవ్వరిని చూచినంతనే సకలాపదలు, సకలకష్టములన్నియు మఱచి యీలోకమునే మఱచుచుంటినో, యెవ్వరితో సంభాషించిన నదియే యింద్రలోకపదవియని యెంచుచుంటినో, యెవ్వరికించుక చెక్కుచెమర్చిన నీలోకమే మునిఁగెనని దలంచుచుంటినో, యెవరి సన్నిధానమును నమ్మి యీ పదునాలుగేండ్లరణ్యావాసము నొక్కనిమిషమున గడవనెంచి యుంటినో, అట్టి నాకలుములపంటను, నాచిలుకలకొలికిని, నావలపులభరణిని, నా బంగారుబొమ్మను, నా జీవధనమును, నాసీతను నాకుఁబాపితివే? ఇంకేమిచేయుదు. ఇప్పటికైనను నీకన్నులు చల్లనాయెనా? హా! సీతా! సీతా!

(మూర్ఛిల్లును.)

(ప్రవేశము: సుగ్రీవుఁడు; లక్ష్మణుఁడు)

సుగ్రీవ ॥ లక్ష్మణా! ఏమియిది? ఏలరామచంద్రుఁడు మూర్ఛిల్లియున్నాఁడు?

లక్ష్మణ ॥ సుగ్రీవా! జానకీదేవినెడఁబాయుటచే యించుక చింతిల్లి సొమ్మసిల్లినట్లున్నది.

సుగ్రీవ ॥ దేవా! రామభద్రా! లెమ్ము. లెమ్ము. ఇదియాలోచింప సమయముకాదు. మన యాంజనేయుఁడున్నవాఁడుకదా; అతనివలన తప్పక మనకార్యము సిద్ధించును. ఆసుధీమణి చనిన కార్యము నెఱవేరదనుట కలలోనిమాట. కార్యవిచారమునందును, ధైర్యమహిమయందును, ఉపాయవివేకమునందును ఆ వాయుకుమారునిఁబోలువారీధరయందుండుటలేదు. అకపులందఱు మధువనమునకు వచ్చియున్నారఁట. దధిముఖుఁడను దూత యిప్పుడే నాకీవార్తచెప్పెను. ఆంజనేయాదులను పిలుచుకొనిరమ్మని వానినిప్పుడే పంపివచ్చితిని.

లక్ష్మణ ॥ రామచంద్రా! మనకార్యము నెఱవేరినదనియే భావింపుము. అంగదుఁడగ్రేసరుఁడట! ఆంజనేయుఁడు యోధుఁడఁట! జాంబవంతుఁడు మంత్రాలోచకుఁడఁట! ఇఁకకార్యము సర్వేశ్వరుఁడగు శ్రీరామచంద్రునిదఁట! అట్టిచో కార్యము విఫలమగునే?

(ప్రవేశము; ఆంజనేయుఁడు పద్యము చెప్పుచు)

ఆంజ ॥ సీతానందకమంత్రం, రఘుకులజలధిప్రాంతసోమార్కమంత్రం, వేదాంతారామమంత్రం, సతతమునిజనోర్జీవమంత్రం, సుమంత్రం, సుగ్రీవాభయదానమనిశం మంత్రం, శ్రీమోక్షమంత్రం, సదాజేయ్యాల్లక్ష్మణసేవ్యమంత్రమనఘం, శ్రీరామమంత్రంహృదీ ॥

(శ్రీరామునకు నమస్కరించి)

శా॥ శ్రీరామా! కనుగొంటి లోకజననిన్, సీతామహాదేవినిన్ ।
సారాశోకవనంబునన్ ఘనతరుచ్ఛాయాభువినిన్ లంకలోన్ ।
శ్రీరామా! రఘురామరామ! యనుచున్ చింతించుసాధ్వీమణిన్ ।
సారంగాక్షిని జూచితిన్ రఘుమణీ సద్భక్త చింతామణీ ॥

దేవా! కంటిని మాజానకీదేవినిఁగంటిని.

శ్రీరామ ॥ వాయుతనయా! నీమహోపకారమెంతని కొనియాడుదు? ఆదేవి యేమని వచించె? నాతో నేమిచెప్పుమనియె? క్షేమముగనున్నదా? రాక్షసుల బాధకుఁజిక్కి తపియించి కృశియించి ప్రాణమాత్రావశిష్టయై యున్నదా? అకటా! నాకు దేవేరియైన కతమునఁగదా యాబిడ యింతటికష్టము నకుగురియయ్యె. నన్నుదూరెనా? తనతల్లిదండ్రుల నాడి కొనియెనా? లక్ష్మణుని నిందించెనా? ఆంజనేయా! జరిగిన సంగతులన్నియు నిదానముగ వచియింతువఁట లెమ్ము. ముఖ్యమగు విషయములమాత్రము వచించి నా పరితాపము మాన్పుమా!

ఆంజ ॥ దేవా! మీచేనానతిఁగైకొని నానాప్రదేశంబుల వెదకి యెందును నాదేవినిఁగానక సముద్రతీరమున మేమందఱము ప్రాయోపవేశముఁ జేయఁబూనితిమి. అప్పుడు సంపాతి వచ్చి లంకాపురి దారిచూప నేను సముద్రమునుదాటి, లంకిణిని మర్దించి, రావణునంతఃపురమునంతయు వెదకి, వేసరి, తుదకశోకవనమున రాక్షసీ గణము నడుమనున్న తనపాతివ్రత్యమహిమమున వెలయు నా త్రిలోకజననిఁగాంచితిని. రామభద్రా! ఆదేవి మీ క్షేమమంతయు నడిగి, కౌసల్యాదియత్తలనడిగి, మఱదుల కుశలప్రశ్నమొనరించి, తమతో నొక్కటి విన్నవింపుమనియె. "చిత్రకూటమున నొక్కకాకి నన్ను చెనకినమాత్రముననే కోపించి యొక్కతృణమున బ్రహ్మాస్త్రమభిమంత్రించి దాని గర్వమణచిన దయాశాలి నేఁడేల నన్ను మఱచె" అయినసుమానె. ఇఁక రెండు మాసములెట్టులో ప్రాణములభరించెద. అంతలో నాజ్ఞాపకము కలిగిన నన్ను రక్షింపుమ"ని మిమ్ము వేఁడెను. లక్ష్మణస్వామితో "తెలియక నిన్ను నిందించినందుకు నన్ను క్షమింపుమ"ని చెప్పెను. తనయానవాలుగా నీ శిరోమాణిక్యమును నాకొసంగెను.

(మాణిక్యమిచ్చును.)

రాము॥ (దానిని చేసికొని) ఆహా! కంటిని జనకజాతను. అఖిల
లోకవిఖ్యాతను కంటిని. మాసీతను కంటిని. ఈమాణిక్యమే
రాజాసకీదర్శన సమ్మోదము నాకుఁగలిగించెఁగా? నాకు
సేస్వాతనించెఁగా? ఓ శిరోమాణిక్యమా! నీకును నాపై
కరుణలేదాయెఁగా? వజ్రవైఢూర్యాది కఠినశిలలతో కూడిన
నీకు మార్దవముకలుగ నేర్చునే? శిరోరత్నమా! నీనాథ
స్థితిచే శిరమునంచియున్న మాసీత బరిబాలమునకు చక్కని
కాంతి నీవొసంగలేదా? [illegible] నీ
ప్రకాశమున నాయనురాగమునమ్మును సూచించి నాకెం
తయు నుపకారమొనర్పలేదా? చిత్రకూటమున నిన్ను తమ
శిరోరత్నముగ నెంచి [illegible]మే తేర భయసంభ్రాం
తయైన నాదేవి స్వయంగ్రహాశ్లేషసుఖమిచ్చి నన్ను
ధన్యుఁజేయలేదా? వినోదమునకై చీకటింట డాగికొన్నయా
సీతామణిని నీదివ్యతేజమున నాకుఁజూపి నాకెంతయు సాయ
మొనర్పలేదా? ఆసీతాస్వయంవరమునాఁడు నీప్రభాసము
దయమున రంగమంటపమలంకరించి నా మానసరాజీవ
పుటంబును సైతము రంజిల్లఁజేసితివే? నేఁడుదుఃఖసాగరమున
మునిఁగి సీతావియోగమున పరితపించుచున్న నన్నుఁజేరి
తివా? అకటా! యెందు నాలావణ్యవతినిఁ గాంతును?
ఎన్నఁడు నాసుందరాంగి సరసనుండు భాగ్యముఁగందును?
అయ్యయో! సకలలోకజాలంబుల నొక్క బాణాగ్రమున
నిలువరించు కాండీరుఁడనై, భూభరణరక్షణప్రశస్తంబగు
క్షత్రియవంశంబున జనియించిన నాయట్టి వీరుఁడు తనయాలి
కష్టము మాన్పి రక్షింపఁజాలకున్నాఁడుగదా? ఇంతటి తల
వంపులు శూరకోటిలో నాకుకలుగునే? కానిమ్ము. ఆదురా
త్ముని, నాపరదారహరణ మహాపాపుని, నా చండాలుని,
రక్కసుని, రావణుని నురుమాడి దానవలోకమునంతయు
పీనుగపెంటలుగఁ జేసెద. లంకాపురిని బూదియొనర్చి సము

ద్రంబునఁగలిపెద. లక్ష్మణా! తెమ్ము నా ధనుర్బాణముఁ తెమ్ము నా తూణీరమ్ముల.

లక్ష్మణ॥ దేవా! ఉపశమింపుము. కోపముపశమింపుము. నీవలిగిన నీప్రపంచమంతయు నాశమగునుగదా? లోకముఁ రక్షించు మహానుభావుఁడవుగదా నీవు? నిక్కముగా నీవు కనుబొమ ముడియిడిన నేది నీకడ్డముగాఁగలదు? లోకానుగ్రహముకొఱకై కొంచెము శాంతినొందుము.

సుగ్రీవ॥ రామచంద్రా! ఈచిన్నకార్యమునకై నీవువెడలనేయునా? నీదాసుఁడగు నేనుడెబ్బదివేల కపిసైన్యముతో సిద్ధముగనున్నాఁడనే? లోకారాధ్యా! నీకసాధ్యమేదికలదు? మరునాఁడు కార్తీకశుద్ధత్రయోదశి దండయాత్రకుమంచి ముహూర్తము. లంకాపురిపై దండువెడలుటకు నాకాజ్ఞయిమ్ము. కోపముడుగుముకొని దయావీక్షణముల మమ్ముఁ జూడుము.

శ్రీరామ॥ లక్ష్మణా! సుగ్రీవా॥ మీయిష్టానుసారముగనే కానిండు. నీవునైశంబేసి కపిసైన్యమునకంతయు సిద్ధముగనుండునట్లాజ్ఞయిమ్ము. ఆంజనేయా! నీయుపకారమెంతని వర్ణింతును?

సీ॥ ఇమ్ముగావనసీమ మమ్ములఁదిలకించి
పలుకరించినదయాపరుఁడవీవె।
సుగ్రీవునకుమాకు సురుచిరమైత్రినిఁ
గలుగఁజేసినసుధీకలితుఁడీవె।
దాటనేరనిసముద్రమును లీలగదాటి
లంకఁజేరినధైర్యలలితుఁడీవె।
జానకీవిరహాగ్ని చావనుండిననాకు
ప్రాణంబులిచ్చిన భవ్యుఁడీవె।

గీ॥ రఘుకులంబును నిలిపినప్రౌఢుఁడివె।
ఇపుడుచనుదెంచి దయనెంచివిప్రులకు।
మహితమాణిక్యమిచ్చిన మాన్యుఁడివె।
వానరోత్తమయుపకార ధరముమీరె।

సుగ్రీవ॥ అంగదా! రేపు తొలిజామునచే లంకాపురిస్థ దండు నెడలుటకు స్థిరముగా నుండవలయునని సైన్యమునకుఁ జెప్పుము.

విభీషణ॥ (లోపలనుండియే శ్రీరామ! మాం పాహిమాంపాహి)
సీ॥ దశరథవరపుత్ర! అసమనీరదగాత్ర
జ్వలనార్కశశినేత్ర! శరణుశరణు।

శ్రీరామ॥ సుగ్రీవా! ఎవ్వఁడో "పాహిపాహి" యంచు నన్ను వేఁడుకొనుచున్నాఁడు పోయి చూచిరమ్ము.

సుగ్రీవ॥ (పోయిచూచివచ్చి) దేవా! ఎవఁడో రాక్షసుఁడు తన పరివారముతో మిమ్ము శరణువేఁడ వచ్చియున్నవాఁడు. ఆజ్ఞ యయినచో పోయి యామాయావి రక్కసుని మర్దించి వచ్చెదను.

లక్ష్మణ॥ సుగ్రీవా! త్వరపడరాదు. వాఁడు రాక్షసుఁడైనను సదుద్దేశమునచే నిక్కముగా సీరామచంద్రునినేల శరణొంద వచ్చియుండరాదు? కావున వచ్చినపిదప విచారించి యేకార్యమును చేయుదము. అంతలో జగత్ప్రళయ మగునా?

(ప్రవేశము; విభీషణుఁడు పద్యముచెప్పుచు)
సీ॥ దశరథవరపుత్ర! అసమనీరదగాత్ర!
జ్వలనార్కశశినేత్ర! శరణుశరణు।
సీతామనస్సంగ! శ్రీవేదహితరంగ!
పరశురామవిభంగ! శరణుశరణు।

మునియాగకృతరాక్ష ! మూర్ఖదానవశిక్ష !
కరుణాంచితకటాక్ష ! శరణుశరణు !
పాలితమునిదార ! వాలిమర్దనవీర !
హరచాపప్రవిదార ! శరణుశరణు ॥

గీ ॥ సకలఖరదూషసంహార శరణుశరణు !
చటులమారీచసంభీమ శరణుశరణు !
నిరతవైకుంఠవరధామ శరణుశరణు !
శరణురఘురామ ! శ్రీరామ ! శరణుశరణు ॥

స్వస్తిశ్రీరామచంద్రునకుఁ దయాసాంద్రునకుఁ దేవా ! నేను విభీషణుఁడను. రావణునితమ్ముఁడను ఆర్తుఁడనై, యనన్యథా గతికుఁడనై, నిన్ను శరణుఁజొచ్చినాఁడను. అభయదాన మొసఁగికాపాడుము. సర్వలోకశరణ్యా! త్వదేక శరణులమగు మముఁబోటి యనాథుల కెంతయు నీవుకదాశరణము ? సర్వ సుఖములకోఁ బాసి వాతాంబు పర్ణాశనులై నిన్నె నస్సు ధ్యానించు తాపసులకు నీవకదాశరణము? దైత్యదానవులచేత ననవరతము బాధింపఁబడు లోకముల కెల్ల నీవగదాశరణము? దిగంబరులై, నిత్యజ్ఞానులై యున్న, సనకసనందనాదులకు నీవగదాశరణము ? నీవెతండ్రివనియు, భ్రాతవనియు, చెలి కాఁడనియు, బంధువనియు నమ్మియున్న ప్రహ్లాదాది సర్వభాగ వత భక్తులకెల్ల నీవగదాశరణుమవు? దీనరక్షకా! నేనును తల్లిదండ్రులను, అన్నదమ్ములను, పురమును, రాజ్యమును, జీవమును, ధనమును, సర్వమునువిడిచి యంతయునీవేయని నీ మఱుగుఁజొచ్చితి. నీవభయమిచ్చి కాపాడకున్న నాకెవరుదిక్కు? సర్వమునకు నీవుకదాదిక్కు ? కావునవార్త దయాళో ! దేవా ! రఘుకులభూషణా ! నాకభయమిమ్ము. నన్నుఁగాపాడుము. (పాదములపైఁబడును.)

శ్రీరామ॥ విభీషణా! లెమ్ము. నీకభయమిచ్చి యున్నాఁడను (లేవ నెత్తి) ఎట్టివారిచేనైనను, ఏవిధముననైనను, ఏకోరికలనైనను, సాధ్యమైనను అసాధ్యమైనను, తప్పకనీకిచ్చియభయమిచ్చియున్నాను. వచింపుము. నీకువచ్చిన భయమేమి?

ఉ॥ ఇచ్చితినిచ్చితే నభయమిచ్చితినీకు భయంబుమానుమా।
ఎచ్చటనుండి యెవ్వరిచె నెంతటికష్టము వచ్చియున్న నే।
నిచ్చితిరక్షనింద్రుఁడు నుపేంద్రుఁడు రుద్రుఁడుదండపాణియున్।
వచ్చినయేని గాఁచెదనపారముదంబునన్ విభీషణా॥

సుగ్రీవ॥ రామభద్రా! నావిన్నపమొక్కటి యాలకింపవలయు. తమవాక్యముల కడ్డమువచ్చినందులకు తమక్షమాపణ వేఁడువాఁడ. ఏమన్న శరణాగత రక్షణము మిముఁబోటి మహానీయ్యులకు నైసర్గికము. అయినను కొంచెమాలోచింపవలయు. దయామహిమమున శరణాగతుల కభయమియ్యతగిన చోట్లధికముగా నున్నను నదియివ్వతగని చోట్లును కొన్నిగలవు అందువచ్చినవాని చక్కఁగ విచారించుట ముఖ్యకర్తవ్యము. ఇప్పుడు మనశరణుఁజొచ్చినవాఁడు మనపగతుని జాతిలోఁ జేరినరక్కసుఁడు. రక్కసులన్నన్ మిక్కిలి మాయావులు మారీచుని మాయకులోనై యిదివఱకు కడ తేరఁజాలకున్నాము. కావున దేవరవారు వానికోర్కె యేమి? వానికభయమిచ్చిన మేలా? కాదా? యని తొల్తవిచారించి యభయమిచ్చుటయే మంచిది.

ఆంజ॥ (విభీషణునిఁజూచి) సుగ్రీవా! ఇతనిని నేనెఱుగుదును. ఇతఁడు రావణుని తమ్ముఁడు. విభీషణుఁడనువాఁడు. ఈ ఘనుఁడు రక్కసులజాతియందుఁ బుట్టినను ధర్మమార్గమునను దయామహిమమునను, నితనిఁబోలువా రుండుట మిక్కిలి యఱుదు. మొన్న రావణుఁడు ననుఁజంప యత్నించియుండ, నీమహానీయ్యుఁడే యతనికి ధర్మము చక్కఁగ నుపదేశించి

దాని మాన్చెను. పిదప, లంక కాలునప్పుడు అయ్యో! "విభీషణుడు సీతాదేవిని రామునకచ్చి రామభద్రుని శరణు వేఁడుమనినను వినక రావణుఁడింత కార్యమునకు కారణ మాయెనని" రక్కసులు ప్రలాపించుచుండ నేవింటిని. కావున నితఁడు కరుణింపఁదగిన వాఁడుకాని దూరీకరింపఁ దగినవాఁడుకాఁడు.

రామ॥ సుగ్రీవా! నీవు మిక్కిలి పొరపడితివి. వాఁడెట్టివాఁడైనను సరియే అనన్యథాభావముచే స్థిరభక్తియుక్తుఁడై నన్ను శరణుఁజొచ్చినవాఁడు పండితుఁడగుగాక, మూర్ఖుఁడగుగాక, బ్రహ్మణుఁడగుగాక, చండాలుఁడగుగాక పగతుఁడగుగాక హితుఁడగుగాక వాఁడెనామెచ్చునకు వచ్చువాఁడు.

సీ॥ పంచపాతకమహాపాపియైనబ్రియుంపు
మిత్రుఁడైనను చాలశత్రుఁడైన।
బహుధనయుక్తుఁడౌ భాగ్యవంతుండైన
పిడికెడన్నములేని బీదయైన।
ననుమోసగించెడు ఘనవంచకుండైన
మొనయుపండితుఁడైన మూర్ఖుఁడైన।
ఉత్తమోత్తమభూసురోత్తముండైనను
కేలసంటగరాని మాలఁడైన।

గీ॥ అవనినెవ్వాఁడుగాని నన్నధికభక్తి।
పాహిపాహియటంచు నాపదముఁజేరు।
వాఁడెపుత్రుఁడు, మిత్రుఁడు, బాంధవుండు।
వాఁడెనాకెందుప్రియుఁడు బోవానరేంద్ర॥

నాకుభక్తులు ప్రియులైనట్లు దారాపుత్రసోదరు లెవ్వరును ప్రియులుకారు. ఎవ్వఁడు "రామరామ" యని నన్ననవరతము ధ్యానించునో, వానియెడనేను పరమసమ్మోదమున వసియించియుందును.

సీ॥ అన్యభావనలేక నాశ్రయించుననన్నె
యెనలేనిభక్తి ధ్యానించునెవఁడు।
భయమువేళనున్నైన "పాహిమాం శ్రీరామ"
యంచుమనమదిలో దలంచునెవఁడు।
సుతులక్షేమున్నైన సతులగోష్ఠియునైన
శ్రీరామయన్న నస్మరించునెవఁడు।
పగబూనినాప్తున పగలురాతిరియట్టి
విడిక్రొమ్మెననాచేరు నన్నునెవఁడు।

గీ॥ ఆశ్రితుం డనుచు నడిగిన నవనినైన।
సంపదలనైన నా రాజ్యమునైన।
నన్యభాగ్యములైనను దేహమైన।
ప్రాణమైన నొసఁగుదునో భానుతనయ॥

కావున రాక్షసుఁడైననేమి? పగవాఁడైననేమి? నామరుగుఁజొచ్చినవాఁడు నావాఁడేకదా? విభీషణా! నీ కభయమిచ్చియే యున్నాను. చెప్పుము నీకెవనివలన భయముకలిగినది.

విభీ॥ రామచంద్రా! రావణుఁడు త్రిలోకజననియైన సీతాదేవియెడ నొనర్చిన మహాపరాధమునకై వానికెంతెంతయో బోధించితిని. అదురాత్ముఁడు వినఁడయ్యె. తుదకు కఠినముగా బోధించితిని అదివానిచెవికి వేగ్గై తన వామపాదాహతి నన్నుఁదన్నెను. నన్నుతన్ననసేల! లంకారాజ్య ప్రాణ ధనంబునే తన్నెను. అట్టివానికడ నుండరాదనితమ్ము భయము వేఁడుటకై వచ్చితిని.

రామ॥ అట్లనా? వానికి కాలమాసన్నమైనది. నీవేమిచేయుదువు. కానిమ్ము. ఆలంకారాజ్యమును నీకొసంగితిని ఇప్పుడే

నీకులంకారాజ్య పట్టాభిషేక మొనరించెదను. సుగ్రీవా! నను స్వపుణ్యనదీ జలంబులం గొనివచ్చుటకు ననవానరులను బనుపుము. మారుతీ! నీవుపూజాద్రవ్యములను గొనిరమ్ము.

సుగ్రీవ ॥
ఆంజ ॥ } భాగ్యము.

(వానరులు ఆంజనేయులు నిష్క్రమించుచు)

లక్ష్మణ ॥ అన్నా! శరణాగతుండైన విభీషణునకు లంకారాజ్య మిచ్చితివిగదా? ఆరావణుండే మనల బుద్ధితెచ్చుకొని నత్కింపుమని నిన్ను శరణొందిన వానికే రాజ్య మివ్వగలవు?

శ్రీరామ ॥ లక్ష్మణా! అందునకేనీవు పిన్నవాడవు.

ఉ॥ రావణుడష్టునన్ను మదిరంజిలగా శరణంబునొందినన్
బ్రోవుమటంచు నచ్చినవిరోధము నేమియు లేదువానికా।
పావనమౌ నయోధ్యాపురపాలన రాజ్యపదంబునిచ్చెనే।
నీవనినుండు వాడనిక నేటికి మాటలుబల్కు లక్ష్మణా!

అకటా! నీవింతనం దేహింతువే? శరణాగతులగు దీనులకు తమదేహంబుల నిచ్చినవారై, యేరాజులు లోకోన్నత విఖ్యాతినొందిరో, తమనేత్రంబులనిచ్చియైన నాశ్రితులనే ప్రభువులుకాపాడిరో, ఒక్కమాటకొఱకై రాజ్యంబుఁగాసి, హీనసేవకుఁడొకి, భార్యావిక్రయముఁజేసి, తుదకు నిజదారను తనచేతులారనే చక్రనృఖండింపనెంచెనో, అట్టివారి వంశమున జనించియు నీవిట్లు సందియ మొందదగునే?

సీ॥ తనదేహమాంసంబు తగనిచ్చిశిబిరాజు
పావురంబునుకూర్మిఁ బ్రోవలేదె।
సత్యంబుఁగాలింప జగతిభార్యనుసుతు
గాలుహరిశ్చంద్ర రాజులేడె।

తననేత్రములనర్థి జనులకిచ్చినయలర్క
ప్రభునతోసుండు కీర్తింపబడయ లేదె।
సర్వజిత్క్రతువున సర్వస్వమిచ్చిన
మనతాతరఘురాజు వినఁగ లేదె।

సీ॥ అట్టిరాజుల వంశంబునందుఁ బుట్టి।
అభయమిమ్మని శరణొందునార్త జనుల।
కేమియివ్వఁగఁజను నేది యివ్వఁజనదు।
ననుచు నక్కట లక్ష్మణా! యనఁగఁజనునె॥

లెమ్ము. పట్టాభిషేక సన్నాహంబులఁ జేయఁబోదము.
(నిష్క్రమణము)

[యవనిక నెత్తగా పట్టాభిషేక మంటపము కనుపించును. విభీషణుఁడు సింహాసనముపై కూర్చొని యుండును. సుగ్రీవాంజనేయాదికపులు ప్రక్కన నిలిచియుందురు. రాముఁడు కిరీటమును తీసికొని]

శ్రీరామ॥ ఎందాక సకలదిశలు, వేదములు నశింపకుందునో, ఎందాక సూర్యచంద్రులు నిలిచియుందురో, ఎందాకధర్మదేవతలు వర్తింతురో, యందాకనీ విభీషణుఁడు లంకారాజ్యము నేలుఁగాక !

కం॥ ఎందాక శ్రుతులు నిలుచును।
ఎందాక సమస్తదిశలు నిలపై వెలఁయున్।
ఎందాక ధర్మ మొనయును।
నందాక విభీషణుండు నవనినిమనుచున్॥

(కిరీటమును విభీషణునకు ధరింపఁజేయును)

ఆంజ॥ "దేవీం వాచమజనయ తిదేవాః॥
తదేవలగ్నం సుదినం తదేవ తారాబ
లం చంద్రబలం తదేవ విద్యా
బలం దైవబలం తదేవ లక్ష్మీ
పతే తేంఘ్రియుగం స్మరామి॥

సుగ్రీవ వ॥ దశరథకూర్మిపుత్రుఁడయి జన్నగాచి జానకీ బిసరుహ
నేత్రి పెండ్లియు యయిపేర్మినిమష్టులఁ జంపతాఁపసజోన
వంద్యుఁడి యరిపాపుల దైత్యులన్మితాన సదృశలీల భక్త
జనతావనుఁడై రఘురాము సత్కథల్ వసుమతినుండు
దాక పరిపాలన జేయుత విభీషణుండిలన్॥

విభీషణ॥ శా॥ శ్రీసీతాంబికకొప్పుపై, శబరిపై, చెన్నారుహస్తీంద్రుపై ।
వాసిన్ భక్తులశీర్షిపై ధనువుపై ప్రహ్లాదునెమ్మనుపై ।
భాసింపనగు రామచంద్రుకరమీ పాపాత్మునంగమ్మునన్
బాసిపన్గను కెంతపుణ్యమరరే భద్రాత్మయో రాఘవా॥

మంగళము.



# అనుబంధములు.

పీల్ రాగము ఆది తాళము

1 కపులు॥ (చూడ) నీమధు వేమాకు నింద్రలోకము
చింతలనెల్ల-అంతముచేయుమనమున ఘనసుఖ
మలరునుగా ॥ చూడ ॥
ఎల్లలోక-మెల్లకల్ల-మేలికల్లె-యిల్లుమాకం-పెల్లు
సౌఖ్య-మొల్లమేము-కల్లకొంభు-చెల్లెలింక-యిల్లు
నమ్మి-యైనగాని-వల్లువాలపెట్టిగాని-ఉల్లాసంబు
పెల్లారంగ-అల్లోయనియెగురుదాము ॥ ఈమ ॥
కనుల-మూసిమూసిమూసి-బలురాగాలుపాడిపాడి
చెలువారంగసంతసంబు-మీరిగంతులేసియేసి-అలరు
సుద్దులాడుచుండు-కలుగువాఁడెపుణ్యవంతు-డెన్న వాఁడె
ధన్యుఁడింక ధన్యుఁడింక ధన్యుఁడింక ॥ ఈమా॥

శంకరాభ రాగము ఏక తాళము

2 కపులు ॥ మధుపానము మేము చేయుదము
మంచిగానము మేము-చేయుదము ॥ మధు
పాత-మధుప్రతీసి-(మంచి) పాతరలోదీసిబోసి
ఆతురముస(దీని)ద్రావి-(బహు) ప్రీతితో-పాటపాడి॥
మధు ॥

శంకరాభరణా రాగము అట చాపుతాళము

3రుమా॥ ఆహా దేవమమ్ముకాపాడవె దయన్ చూపవె-దయన్ చూడవె॥
తార॥ పతిబిక్షమిమ్మంచూ-అతిశయభక్తితో - మతి నిన్ను వేడెద-
కాపాడవె-కృపంచూడవె॥

అఠాణ రాగము ఆదితాళము.

4 లక్ష్మణ ॥ ప్రేమనుబ్రోవుమిక-రామా॥ ప్రేమ॥
ప్రమాదమతినితఁ డెరుఁగఁడుతలప
ప్రజ్ఞ లేమితాఁ జేసె॥ ప్రేమ॥
భూరిగుణాశ్రయుఁడు-రామ

భానుతనయుని బ్రోవగతగును
భక్తశరణ్యుండవీవు॥ ప్రేమను॥
యింగ్లీషునోటు ఆదితాళము

5 సుగ్రీవ॥ ఓ కపులారా-వలిముఖులారా
పావనులారా-భటులారా
సీతమాతను-వెదకన్నిప్పుడె
వెడలుండు వేగం-బరుదార॥ ఓ కపు॥
కపులు॥ భాగ్యము దేవ-భాగ్యము దేవ
సుగ్రీవ॥ పొండు-పొండు-మీరింక
లోకంబంతయు-పీకిక వెదకుచు
సీతను గాంచుండు-చెలువార
కపులు॥ కనెదముపూర్వము-కనెదముపశ్చిమ
కనెదము నుత్తర-దిక్కులను
నొదుండిన మే-మందులధారుణి
నందన కనెదము-నింపారగ॥

మాల్కస్ రాగము రూపకతాళము

6 కపులు॥ జానకీని-కానలేమే-కానమెందుచూచిన
దీనులైతి-మీనగాలి-మానవేలదైవమా॥ జానకీని॥
గిరుల గిరుల-తిరగి తిరగి-కరుల హరుల-నడిగియడిగి
ధరణి తనయ-నరయమైతి-మకటజానకీపతే॥ జానకీని॥

పైపాటలోని చరణము

కపులు॥ ఏమిగతియొ-యింకమీద-రాము నెట్టు-మేముగాంతు
మేదిదారి-యింకమాకు-నినకులోత్తమా- రామా॥ జా॥

కమాజ్ రాగము ఆదితాళము

కపులు॥ బలుసమ్మదము మాకుకలిగె-చెలగె
చింతలుబాసె వంతలునీగె-స్వాంతంబందు-సంతోషంబు
నిండారంగ-నింపారంగ-ధన్యులమైతిమీవేళ ॥
సీతాదేవిమాకుకనగా-గలిగె

రావణుగాంచి రాయడిమించి. దేవినిగాంచి-విక్రమ
మెంచి-రామునిఁజేరి-తాపంబారి-మీరఁగలిగె
మాకింక ॥ బలీ

హరికాంభోజి రాగము ఏకతాళము

9 అంగద ॥ బ్రోవు మమ్ము కృపచేత-పావనీ
భూమిసుతఁగాంచి-కావవే ॥ బ్రోచి ॥
రఘువీరుండు-శోకముమాన-రంజిల్ల చేయగదే ॥ బ్రోవు॥
ఇల పైకీర్తి-చెల్లువారంగా-మమ్మిందు బ్రోవగదే॥ బ్రోవు॥

10 ఆంజ ॥ (శుద్ధపత్రమును చూపుఁడు)

11 ఆంజ ॥ (శుద్ధపత్రమును చూపుఁడు)

యింగ్లీషునోటు ఏకతాళము

12 లంకిణి ॥ విరోధరీతి-గాసురాళి-భూరితాపమొందగ
కరాళఖడ్గ-ధారచీల్చి-రక్తధారచల్లగ
భరంబటంచులోకివార-మెల్లభీతిపారగా
పురారియిచ్చి-నట్టియీపరాతిలేకమొందవే
సారీ-లోకమెల్లపారదా-ఓరీయిందుచేరితేల
నీచ-వానరా ॥ విరోధ ।

ఆంజ ॥ ధరావిరోధ మేలచేసి మీరినన్నుపల్కెదే
సురాసురాళి వచ్చినీకు సారధైర్యమిచ్చినన్
బిరాననిన్ను నోర్చియిందు పారవైవజాలనే
నారీ-వంచునింతనూరక నోర్చుకొంటి
యోసీ నొంపజాలవేగుమా॥ ధరా ॥

జంగ్ల రాగము ఆదితాళము

13 ఆంజ ॥ జానకినెందు-కాంచువాఁడ నీపురినేనయ్యో
నేనెటురాము చెంతకుబోదు నేమని తెల్పుదునో
మానసమెంతో హీనతమించె దీనతచేకూరె ॥
రాఘవవంశ నాశముకలిగె నావల్ల నేడకటా
రామునికరుణ యేమనికలదో రాఘవ(శ్రీ)రామ ॥

శ్యామకల్యాణి రాగము   ఏక తాళము

14 ఆంజ॥ నేనెందుకానలేనైతి జానకిని కానలేనైతి.
దీనతనొందనాయె ప్రాణంబుమానినాయె। నేనెందు॥
శ్రీరామునెట్లుగాంతు-ఏమనివిన్నవింతు
నమ్మదినెట్లుగాంతు జీవింపనెట్లుచేర్తు మాతల్లి
నెందుగాంతు॥ నేనెందు॥

కాపీ రాగము   ఏకతాళము

15 స్త్రీలు॥ ఎందుమాకీ వ్యసనముతొలగునో
యెన్నడుని రావణుడిలవిడచునో॥ ఎందు॥
పనివిడిదనుజుల బాధకులోనై
వనటల మునిగితి మకటరమాపతి॥ ఎందు॥
పురమునుసఖులను పోవగజేసితె
ధరణిని నుండక చేసితెదైవమ॥ ఎందు॥

వసంతవరాళి రాగము   ఆదితాళము

16 ఆంజ॥ దరిలేనిబలువెతలాయె మాతల్లిని కనలేమియాయె
ధరణినియసువుల బాయగనాయె॥ దరి॥
యెన్నడుసీతను కాంచెడివాడను యింపుగధన్యత
నొందెడివాడను యినకులతిలకుని నొందెడివాడను॥
దరి॥

హిందుస్తానికాఫీ రాగము   రూపకతాళము

7 సీత॥ రాఘవా శ్రీధవా కావవా
కావవా పావనానిరంజనా॥ రాఘవా॥
దనుజునిబారికి దీన నైతి లసద్భయా భంజనా
రాగదే దర్శన మీగదే॥ రాఘవా॥
రవికులభూషణా-నారా-యణా-లసద్దయా
చంద్రమా - చూపుమా-నీదయా-
మోదమా-బ్రోవుమా॥ రాఘవా॥

అసావేరి రాగము ఆటతాళము

18 సీత ॥ ఆహా బ్రోవ రావేల నాచెంతకో రాఘవా ॥
నను జూడ రావేల యో రాఘవా॥ ఆహా॥
మనస్ చాల నీభూమి మనోవల్లభా
ఘనాయాస మింకేను తాళుమనే॥ ఆహా॥
నీచాత్ముండౌ రావణు బారికీ
ననున్ద్రోసి కాపాడ రావేలకో॥ ఆహా॥

హిందుస్తానికాపీ రాగము ఆదితాళము

19 రావణ ॥ వరనీరేజ నేత్రినను చేర్చి ప్రమోదమున
మీరివిమోహమున నేలవే
ననునిన్నాళ్ళు మన్నింప కున్నావె భీతిహారిణేక్షణా॥
వర॥
మానవుని-మానుమింక-మారుండుననునేచసాగెనే
పద్మముఖి" వర॥

రాగము తాళము

20 రావణ ॥ ఓ భామా-ననుగనుమా-కోపము-యిటుతగునా॥
లోకాధీశుండ- నేనీదాసుండ-నీకరుణారస-
మొక్క-టి జేర్పుము॥ ఓ భామా॥
ఈలంకాపురమంత-నీకింక-నొసగెదను॥
శంక లేక-నానాకవాసులీ-కింకరులై పద-సేవలం
జేతురు॥ ఓ భామ॥

ఇంగ్లీషునోటు ఏకతాళము

21 సీత ॥ ఛీ-రావణచనుమా-ఇలగిమనుమా హితము
వినుమా-వదరకుమికపో-ఛీ-ఛీ-ఛీ॥ ఛీ॥
వదరకు హీన-వదరగనౌన-రఘుపతిబాణ-మెద
గొనవౌన-వెసనను-నొసగుము-మసలకు ఛీ-ఛీ ॥ఛీ॥

రావణ ॥ పో - పాపినిపలువా-నన్నుగనవా - హితమువినవా-
పలుకకుమికపో-పో-పో-పో-పో ॥
దనుజులునిన్ను - మననియరెందు-ననుశరణొందు- మననగు
నెందు-పడతిరో-చెడకుము-మిడుకకు పో-పో-పో ॥

ఇంగ్లీషునోటు. రాగము. తాళము.

22. రావణ ॥ పడుమిందూరక-చెడుగుంగోరక-పాపపుమాటల నాడెద
వేటికి-నుడువకుమిక నోరార-దుడుకుతనము నిండార-మిడు
కకుమో పడతీ-కనుగొనితడబడుచుఁ ॥ పడు ॥

రాగము. తాళము.

23. ఆంజ ॥ కొనుమంగుళీయ్యమో వనజేక్షణా
ఘనవేదమార్గము-కనుమమ్మరో
మనమానందమొందగ-చేకొనవే

తే ॥ శ్రీరాముగాంచినే-ధన్యతగ్గంటిగా
ఈనాడు సమ్మోద-మీడేరెగా

ంజ ॥ జనయిత్రి-నీనాథు శేమంబును
మనసార-నాలించి-ననుపంపుమా

త ॥ ఘనభాగ్య మబ్బెగా-యోపావనీ
నినునేడుకొనియాడ-గాజాలనే
ననుబ్రోచి రక్షించి కాపాడియు

రాగము. తాళము.

సీత ॥ అన్న నేడు-ధన్యనైతిగా
చెన్నుమీరరామువార్త-చెప్పినన్నుబ్రోచితీవు॥ అన్న ॥
జ ॥ అమ్మయేల-నన్నుతింపగా
నెమ్మనంబునలరెనిన్ను-నెమ్మిగాంచుభాగ్యమబ్బె॥ అమ్మ ॥
॥ చా-లా-మే-లా-యే-గా-దె ॥ అన్న ॥
జ ॥ నన్ను-నింత-నెన్న-నెంత-వాడ-తల్లి ॥ అమ్మ ॥

సీత ॥ వింతగు-సంతస-మింతట-గూర్చితి-వంతలమాన్చితి॥ అ॥

ఆంజ ॥ చెల్లునె-లోకము-లెల్లను-పెల్లుగ-బ్రోచెడుతల్లివి ॥ అ ॥

సీత ॥ రామాధిపు-సేమంబున-నామానస-మామోదము
ప్రేమంబును-కావించితి ॥ అన్న ॥

అంజ ॥ నీశోకము-లోకావళి-పోకార్పరె-యీ్కైవడి
శోకిల్లగ-నీకేటికి ॥ అమ్మ ॥

సీత ॥ నిసుగననా-వనటలుపో-యెనుగదపా-వనచరితా దను
జులబాధల-కలచివినిచి-పతితోమనవి-మనవిని వినుపవె
మనుపవె॥ అన్న ॥

ఆంజ ॥ జననిరోసీ-ఘనకృపచే-దనుజులనే-దునుమనెనీ-వడలకు-
పతినినిటకు-కొనగావలెనే దయను-అనుమతి నొసగవె-
ఘనతను ॥ అమ్మ ॥

సీత ॥ మహోపకృతిగద మాయన్న-మహాద్భుతమునిది
మదినెన్న-మహాత్ముడగు రఘుపతిగన్న
మేలుగదా భూరిముదా సారముగా రాముఁడు
రా-సమస్తముల్-ప్రమోదమగు॥ అన్న ॥

ఆంజ ॥ విచారమొదవదు మాయమ్మ-కృపాత్మురఘువరు
గనెదమ్మ అపారవ్యసనము వలదమ్మ-
రావణుదుఁ చావడెలం కావనియుఁ రామునిచే
ముదంబికఁ గనఁగలిగె ॥ అమ్మ ॥

రాగము. తాళము.

25. రాక్షసులు॥ వానరమమ్ము కానవునోరీ హీనాబ్రతుకవు కానీర ॥

ఆంజ ॥ రక్కసులారా నిక్కినమీరు దక్కరుయింక పోపొండు॥

రాక్షస ॥ పోరాడఁ వలదోరోరి

ఆంజ ॥ చాలునుమిమ్మీ నేలకుబలిగా
కూలఁ వేయుదు నేపార ॥

రాగము. తాళము.

26. అందరు॥ లంకాధి పాలన దేవా
లోకైక వీరాధి వీరా॥ లంకా॥
పాకారిసన్నుత కోకారిసేవిత నాకారి సం
రక్షణా రావణ దేవాధి దేవా
సార లోకా ధీరా లోకాధారా॥ లంకా॥

రాగము. తాళము.

27. రావణ॥ కొనిరమ్మా వేగమే
ధనువునిషంగము తడియాకనశియ॥ కొని॥
నారథమిప్పుడె చేరికబూన్పుము
సారథివగుముని వ్రారకసచివ॥ కొని॥
రణమునవాకపి కినిసివధించెద
ఘనసురులెల్లను వనటనుమునుగ॥ కొని॥

రాగము. తాళము.

8. అక్షయ॥ ఓరోరోరీ నిలునిలుమికపాగ
రడచెదవానర రణమందున్॥
కరంబునిటునిన్ విరోధగతిచే
ధరన్బడగనిన్ దునియింతున్॥

ంజ॥ బాలా-మేలా
క్ష॥ పోరన్ రారా
ంజ॥ బాలుడు వీలాగు నాలంబు చేయంగ
చాలుదెబాలక పోలునేరా॥
క్షయ॥ యిటులన్ పలుకన్ నగునే పాగరే
ంజ॥ వైరంబునీ కేలాయికన్ పోరాడగా
ధీరుండవేనీవు వీరుండవే॥

రాగము. తాళము.

29. అతి ॥ ఎవ్వడువాడావానరుడు కొవ్వడగించెద శరములచే
అవ్విభుడింద్రుడువచ్చినను నొవ్వగజేసెద నిముషములో ॥
దనుజులకొందరి మోసమునన్ దునిమిన సేవా కివ్విడ వే
కనుమికనాదగువిక్రమమున్ మనమునభీతి చెవారకుమా ॥

30. అతి ॥ వరసరోజలోచన రామ రవికులాబ్ధిసురుచిరసోమ
రఘురామ-పరధామ-అరిభీమా ॥ వర ॥
ధరణిజామనోంబుజకామ-మునిజనాంచితావర రామా
దయగనుమా-మదికొనుమా-వరనామా ॥ వర ॥
మదినేమియు తెలియనివాడఁ-ఘనకలుషముచేసిన
వాడఁ పశివాఁడఁ నీవాఁడఁ తరిగ్రోనఁ ॥ వర ॥

రాగము. తాళము.

31. ఇంద్ర ॥ ఓ వానరాధమచూడుమా పొగరిక మూనా వేం॥ ఓ॥
భూరిమదంబున మీరిదురక్తుల కోరివచింపకు పేరున
ణంచెద॥ ఓ॥

ఆంజ ॥ ఛీ రాక్షసాధమబల్కగా వలవదువినుము ॥ ఛీ ॥
రారమహోన్నత సారమణంచెద ధీరవరుండవె పాప
విచారుడ॥ ఛీ॥

ఇంద్ర ॥ నీ విరోధమునఁ వధింపగనిఁ విధించెదనె దురా
కృతముఁ మనంబునగనఁ వదరకు వచించెదఁ
విచారముఁ వలవదు ॥ ఓ ॥

ఆంజ ॥ నీ పరాక్రమమే నెరుంగనెయో సురారి వృథా
దురాగ్రహమే వెసఁ కలఁ చెదఁ దురమున
హరించెదన్ ధరన్ యికస్ బ్రతుకవు ॥ ఛీ ॥

రాగము. తాళము.

32. ఆంజ॥ కృపాభిరామ రామ శ్రీ పరాత్పరా
అపారమాయావిపంచరా కృపాకరా కష్టనిరసనా

పురందరదాసు

రాగము. తాళము.

34. రావణా॥ ఎవ్వడంపెనువాడురా నీ వేటికిలంకనుజొచ్చితిరా
యిప్పనంబునేల యిలప్పైనసాల్చితి నొప్పగ జేసితి దను
బాలనేలరా॥ ఎవ్వ॥

ఆంజ॥ (శ్రీ) రాముబంటును నేనురా ఓరావణా సీతకై వచ్చితిరా॥
ఆదేవితోనిచ్చి అపరాధ మొందితి అటునిన్ను శిక్షింప
అంపె రాముఁడు నన్ను॥ రామ॥

రావణా॥ రాముఁడెంతటివాఁడు రక్కసులకు రాముఁడొక్క తృణము॥
తోలిముగ్గానాని నలచిభక్షింపనె పలుగాకివాని
నెలగినుతింపాదె॥ యెవ్వ॥

ఆంజ॥ వాలిచంపినవీరుఁడు కోదండముపట్టువారికి గురుఁడు
వాలినివెరుగనె వాలమ్మునను చుట్టి వార్ధులముంచుట
మరచిపోతివా దైత్య॥

తాళము. రాగము.

రావణా॥ చచ్చితినామబారి
ఆంజ॥ ప్రేలకుమింకనోరి
రావణా॥ పక్కవునీవిసారి
ఆంజ॥ నీచేతేమాపోపోరా
రావణా॥ నీప్రాణంబులతీసి మారక్కసవీరులకిత్తు
ఆంజ॥ రాముని ప్రేమమున్ నాయడకలుగగ నీచేతేమాపోపోర
రావణా॥ మీరాముఁడెంతటివాఁడు.



ఆంజ॥ ఆప్రాలినిచంపినవాఁడు.

రావణ॥ ...కవీరుడా।

ఆంజ॥ మీమానుఅడుగుము పోపోర

రావణ॥ మానవులెంతటివారు ఛీమూయుమయికనీనోరు

ఆంజ॥ రాముని బాణము నీయెదనాటగ తెలిసెదురావణ
పోపోరా॥

రాగము. తాళము.

36. రావణ॥ నేనిక్కముగానినుసైపనురా దురాచారా దురాచారా
మేరామరికారులుపల్కు మదమణగింతునుపోపోరా
వడిద్రోయింతున్ నడిబాధింతున్ మరిచంపింతున్ నిను
ఖండింతున్
రాముని గీముని నెంచెద మించెద పగతుని పొగ
డెదుపోపోర॥ నే॥

10-వ పాటలోని కడపటిచరణము.

ఇంగ్లీషు రాగము. తాళము.

38. అందరు॥ ఆనందంబలరగధర లంకనునేలు.
ధీరతమీార కీర్తియుచేర సంతసమార లంకనునేలు॥ ఆనం॥
యీాలంక పాలించి ధర్మములను నిశ్శంకరక్షించి
దైత్యులనింక యింపారకాపాడి సొరగను మోదంబు
నను లంకనునేలు॥ ఆ॥

సుగ్రీవ॥ కనుడికపూర్వము కనుడికపశ్చిమ
కనుడికదక్షిణ దిక్కులను
ఎందుండినమీా రందులధారుణి
నందనుకనుడీ యింపార॥

దేశి